# గిడుగు రామ్మూర్తిగారి
# ముందుమాటలు



అనువాదం
**కణుగుల వెంకటరావు**



**గిడుగు రామమూర్తిగారి 68 వ వర్ధంతి**
**ప్రత్యేక సంచిక**

సోర మాన్యుయల్, సోర ఇంగ్లీష్ డిక్ష్నరీలకు

గిడుగు రామమూర్తి గారి

# ముందుమాటలు



అనువాదం

**కణుగుల వెంకటరావు**

**గిడుగు రామమూర్తి గారి 68 వ వర్ధంతి ప్రత్యేక సంచిక**

**22-1-2008**

SAVARA
Volume-2. Number-1.
January 2008

AUTHOR'S PREFACE
of
A MANUAL OF THE
SO:RA (OR) SAVARA) LANGUAGE
&
AUTHOR'S PREFACE
of
SORA-ENGLISH DICTIONARY
by **Rao Sahib G.V. Ramamurti**, B.A.

Translated into Telugu
by **Kanugula Venkata Rao**, B.Com

Editor:
**Dr. A. Chandrasekhara Rao**

Printed, Published & Owned by
**Dr. A. Chandrasekhara Rao**
Aadarsa Kala Mandiram,
Madugula Street
PONDURU - 532 168
Ph: (08941) 242142;
Cell: 9949605141

Printed at
**Mahodaya Graphics, Koti Street**
Srikakulam. Ph:652498

**Rs: 25/-**



**అంజలి**

కడు ప్రయాసల కోర్చి
సవరభాషను నేర్చి
రాతపద్ధతి తీర్చి
రూపురేఖలమర్చె.

పలుగ్రంథములు కూర్చి
సవరద్వారము తెర్చి
అంధకారము చీల్చి
వెలుగు బాటను చేర్చె.

సవరభాష గురించి
పడిన శ్రమ గుర్తించి
సవరభాష విరించి
అనిరి ప్రజ కీర్తించి.

కణుగుల వెంకటరావు
శ్రీకాకుళం

# ప్రస్తావన

2005 ఆగస్టు 29 వ తేదీని గిడుగు రామమూర్తి 143వ జయంతి సందర్భంగా సవర బులిటిన్ తొలిసంచికను విడుదల చేశాం. నాటినుండి అవిచ్ఛిన్నంగా ఒక సంవత్సరకాలం 11 సంచికలు నెల నెలా ప్రచురిస్తునే వచ్చాం. సవరలను విద్యావంతులను చెయ్యాలనే తాపత్రయంతో, వారు తమ మాతృభాషలో చదువుకోవడంకోసం సవరభాషలో కథలను, పాటలను తెలుగులిపిలో సవర బులిటన్‌ల ద్వారా అందించడం జరిగింది. వీటిని ఉపయోగించుకొన్నవారు వున్నారు. కాని ఈ పత్రిక తమ మాతృభాషలో చదువుకోవాలన్న ఆశగల సవరలందరికీ చేరలేదు. సవర కథల, పాటల తెలుగు అనువాదాలు చదువుకొని ఆనందించిన తెలుగువారు కొందరు సవరభాష నేర్చుకోవడానికి ఒక బోధనాగ్రంథం ఉంటే బాగుంటుంది అనే అభిప్రాయం వ్యక్తం చేశారు. వారికోసం, సవర గ్రామాలలో పనిచేస్తూ సవర విద్యార్థులకు పాఠాలు బోధిస్తున్న సవరభాష రాని తెలుగు ఉపాధ్యాయుల కోసం "సవర నేర్చుకొందాం" సిద్ధంగావుంది. పుస్తకం కొనేవారి సంఖ్య 400 లకు తగ్గితే అచ్చువేసి ఆర్థికంగా నష్టపోవడం జరుగుతుంది. అందుచేత ప్రస్తుతానికి గిడుగు రామమూర్తిగారి ముందుమాటలు ప్రచురిస్తున్నాం.

"ప్రజలు మాట్లాడుకొనే భాషలు ప్రపంచంలో 7000 వున్నాయి. వీటిలో ఏదో ఒకటి ప్రతి రెండువారాలకీ నశించిపోతుంది. ఇవి ముఖ్యంగా ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికా, సైబీరియా, ఉత్తర ఆస్ట్రేలియాలలోని ఆదివాసీ భాషలు అంటూ 2007 సెప్టెంబరు 20 వ తేదీ హిందూలో "గ్లోబల్ హాట్ స్పాట్స్ ఆఫ్ ఎన్‌డేంజర్డు లాంగ్వేజస్" అని ఒక వార్త ప్రచురించారు. జీవద్భాషల సంస్థకు అసోసియేట్ డైరెక్టరు అయిన ప్రొ॥ కె. డేవిడ్ హారిసన్, "భాషలు నశించిపోవడానికి ముఖ్యకారణం ఆయాభాషలకు లిపి లేకపోవడం; ఆ భాషలలో గ్రంథాలు, నిఘంటువులు లేకపోవడం" అంటూ ఎంతో ఆవేదన వ్యక్తం చేశారు. ఒక భాష నశించిపోతే ఆ భాషతోపాటు ఆ భాషమాట్లాడేవారి నమ్మకాలు, ఆచార వ్యవహారాలు, పురాణకథలు, వైద్యం, మందులు, మంత్రాలు, ఇంజనీరింగు, అన్నీ నశించి పోతాయి. ఇవన్నీ గ్రంథస్థం అయినప్పుడే వారి జ్ఞానాన్ని భావితరాలకి అందించగలం. సవరభాష నశించిపోకుండా ఆ భాషలో నిఘంటువులు, కథలు, పాటలు, సంభాషణలే కాదు ఆ భాషకొక వ్యాకరణం రాసి డేంజరులో పడిపోకుండా కాపాడిన మహానుభావుడు గిడుగు వెంకట రామమూర్తి.

"జాతి పునరుజ్జీవనం కోసం కృషి చేసిన వారిలో గిడుగు రామమూర్తిగారు అగ్రగణ్యులు. అనేక రంగాలలో తొలికృషి ఆయనదే. గిడుగువారి బహుముఖీనమైన

ప్రతిభా పాటవాలను సరిగ్గా అంచనా వేయలేక పోవడంవల్లనే ఈనాడు ఆయన్ని ఎక్కువమంది కేవలం వ్యావహారిక భాషావాదిగా మాత్రమే పరిగణిస్తున్నారు. ఆయన డేనియల్ జోన్స్ వంటి బ్రిటిష్ ధ్వనిశాస్త్రవేత్తలతోను, ఓటో యెస్పర్సన్ వంటి వ్యాకర్తలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిన అంతర్జాతీయస్థాయి భాషాశాస్త్రవేత్త. పండితులను ఆశ్చర్యపరచిన తెలుగు కావ్యభాషా పరిశోధకులు. గొప్ప శాసన పరిశోధకుడు, థర్స్టన్ రచించిన కాస్ట్స్ అండ్ ట్రైబ్స్ ఆఫ్ సదరన్ ఇండియా సంపుటాలలో సవరజాతికి సంబంధించిన అంశాలకు ఆధారాలైన పరిశోధక రచనలు చేసిన నృశాస్త్రవేత్త. సవరలకు వారిభాషలోనే విద్య నేర్పాలని వాచకాలు, నిఘంటువులు, వ్యాకరణం వ్రాసి, సొంతడబ్బుతో సవరపాఠశాలలను నడిపిన మానవతావాది. ప్రజోపయోగంకోసం అపారమైన పరిశోధనలు చేసిన అరుదైన భాషాశాస్త్రవేత్త." చేరా

1931 లో రామమూర్తిగారు రచించిన సోరా మాన్యువల్ అంతర్జాతీయ ధ్వనిలిపిలో రాయబడిన మొదటి వర్ణనాత్మక వ్యాకరణం.

అమెరికాలోని హవాయి విశ్వవిద్యాలయంలో భాషాశాస్త్రంలో ప్రొఫెసర్గా వున్న స్టాన్లీ స్టరోస్టా సవరభాషమీద పరిశోధనచేసి 1967లో డాక్టరేట్ పట్టా పొందారు. తాను గిడుగు రామమూర్తిగారి సవరభాషా వ్యాకరణాన్ని ఎక్కువగా వాడుకొన్నానని, దాని నిర్దుష్టతకు సమగ్రతకు ముగ్దుణ్ణయానని ఆయన రాశారు. స్టరోస్టా తన సిద్ధాంత గ్రంథాన్ని రామమూర్తిగారికి అంకితం ఇస్తూ గురువు, మానవతావాది, ముండా లింగ్విస్టిక్సులో మొట్టమొదటి పరిశోధకుడు అని శ్లాఘించాడు.

స్టాన్లీ స్టరోస్టా 1981లో హైదరాబాద్ వచ్చినప్పుడు చేకూరి రామారావుగారి కోరికమేరకు రామమూర్తిగారిపై ఒక వ్యాసం రాస్తూ అందులో 1967లొ తన సిద్ధాంత గ్రంథాన్ని రామమూర్తిగారికి అంకితం ఇస్తూ రామమూర్తి గారిని 'ముండా లింగ్విస్టిక్సులో మొట్టమొదటి పరిశోధకుడు' అన్నానని వ్రాస్తూ "నేను 'ముండా' అన్న విశేషణం వాడకుండా వుండవలసిందని ఇప్పుడు భావిస్తున్నాను. గిడుగు రామమూర్తి యూల్స్బ్లాక్, హెచ్. మాస్పెరో, హెవెసే, డేనియల్ జోన్స్ వంటి సమకాలీన భాషావేత్తల ప్రశంసలు పొందిన వ్యక్తి. ఇప్పుడు సుమారు 15 సంవత్సరముల అనంతరం కొంతపాండిత్యం సంపాదించిన తరువాత వారియొక్క గొప్పతనం గ్రహించగలిగాను. బహుశా రామమూర్తిగారు తమ కాలానికంటె ముందు పుట్టి వుండవచ్చు. ఆధునిక భాషాసిద్ధాంతాలయిన స్ట్రక్చరిజం, జనరేటివ్ ప్రక్రియలను గిడుగు రామమూర్తి గారు ఆనాడే తమ రచనలలో ప్రవేశపెట్టారు" అంటూ గిడుగువారి వ్యక్తిత్వం, సునిశిత పరిశీలన, పట్టుదల, శాస్త్రీయ దృక్పధంగురించి గొప్పగా కొనియాడారు.

మాస్పెరో వంటి భాషాశాస్త్రవేత్త మధ్యప్రత్యయాలగురించి వివరించండి అంటూ రామమూర్తిగారిని కోరడం గిడుగువారి ప్రజ్ఞావిశేషాలకు ఒక నిదర్శనం. మధ్యప్రత్యయాలను గుర్తించడం కష్టం. ఉదా॥ మనం త్రాగడానికుపయోగించే "గరగ" లో మూడు పదాంశాలున్నాయి. గ = త్రాగు. అర్ = నామ్నీకరణం. మళ్లీ 'గ' పునరుక్తి, కొనసాగింపును తెలియజేస్తుంది. అలాగే 'గోదారి' లో "గో + ద'అ + అర్ + ఇ " అని నాలుగు పదాంశాలున్నాయి. "గో = ఎక్కువ, ద'అ = నీరు, అర్ = నామ్నీకరణం, ఇ = కదలికను తెలియజేసే క్రియ. "గొప్పనీటిప్రవాహం". (గ్రాండ్‌రియో, పెద్దేరు)

రామమూర్తిగారి మీదగల భక్తితో, వారి శిష్యురాలు నివసించిన సెరంగో గిరిజనగ్రామం చూడడానికి నేను, శ్రీ కణుగుల వెంకటరావుగారు తే 25-5-2006దీన వెళ్లాం. గిడుగు రామమూర్తిగారి కాలంనుండే క్రిష్టియన్ మిషనరీలు సవరభాషలో మత ప్రచారం చేస్తున్నారు. పర్లాకిమిడికి 40 కిలోమీటర్ల దూరంలో కొండలపైన 2500 అడుగుల ఎత్తున సెరంగో, గిరిజన గ్రామం, ఉంది. అక్కడ మిషనరీగా పనిచేసిన మిస్. మన్రో రామమూర్తిగారి వద్ద సవరభాష నేర్చుకుంది. అక్కడ నేటికీ సవర బాప్టిస్టు క్రిష్టియన్ మండలి సమ్మిలోన్ వుంది. వారు క్రైస్తవ మత గ్రంథాలను సవరభాషలో రాయడానికి రోమన్ లిపినే వాడుతున్నారు. రోమన్‌లిపిలో రాసిన బైబిల్ వుంది. బెతానీ బంగ్లా (మిస్ మన్రో నివసించిన బంగళా) తోటలో WELCOME . "GIJ GIJ BA DO MO' I 'HNA BA BINDO TARBAN ARUR DONG" (చూసి ఆనందించండి కాని పువ్వులు తెంపొద్దు) అని సవరభాషలో రాసిన బోర్డు కనిపిస్తుంది. పర్లాకిమిడి నుండి సెరంగో వెళ్లే మార్గంలో "BANGSA ARDUAL" అని రోమన్ లిపిలో రాసిన సవర బోర్డులు కనిపిస్తాయి. సంప్రదాయానికి అలవాటుపడ్డవారు ఈ లిపిలో చదువుకొనే వీలుంది. గిడుగు వారిని అక్కడ చిరంజీవులుగా చూడవచ్చు.

లిపిలేని సోర భాషలో మాట్లాడుతున్న సవరలకు వారి మాతృభాషలో విద్యావంతులను చేయాలనే ముఖ్యమైన లక్ష్యంతో గిడుగు రామమూర్తిగారు ముప్ఫై ఏళ్లు ఎన్నో కష్ట నష్టాలకు ఓర్చి సోరభాషకు వ్యాకరణం, నిఘంటువులు, వాచకాలు తయారు చేశారు. సాహిత్యాన్ని సేకరించారు. వారి నిర్విరామకృషి ఫలితంగా సోరభాషపై ప్రపంచస్థాయి రచనలు వెలువడ్డాయి. వారి రచనలు వెలుగుచూసి ఏడున్నర దశాబ్దాలు గడిచాయి.

"సోర భాషపై నాకృషి పునాది మాత్రమే" అని గిడుగువారు చెప్పుకొన్నారు. తన పునాదిపై సమగ్రసాహిత్య భవంతి నిర్మాణం కావాలి అని ఆకాంక్షించారు.

రామమూర్తిగారు రచించిన బాలకవి శరణ్యము, ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజము కొంతమందైనా తెలుగువారు చదుకొని వుంటారు గాని, వారి సవర గ్రంథాలు భాషాశాస్త్రవేత్తలు మాత్రమే చూసివుంటారు. గిడుగు రామమూర్తిగారు ఇంగ్లీషులో రాసిన సోర (సవర) మాన్యుయల్, సోర ఇంగ్లీషు డిక్షరీలకు ముందుమాటలు వ్రాశారు. వాటిలో తెలుసుకోవలసిన విషయాలు చాలా వున్నాయి. అవి రామమూర్తిగారి ప్రతిభావిశేషాలకు మణిదర్పణాలు. వీటిని చదవవలసిన అవసరం భాషాశాస్త్రవేత్తలకేకాదు, ప్రజలగురించి ఆలోచించే ప్రతివారికీ వుంది. వాటి తెలుగు అనువాదాలు అందజేస్తే తెలుగువారితోపాటు తెలుగు తెలిసిన సవరలు చదివి గిడుగు రామమూర్తి గారి కృషినుండి స్ఫూర్తి పొంది సోరభాషాభివృద్ధికి పనిచేస్తారనే ఆశతో ఈ అనువాదాన్ని అందిస్తున్నాం.

సాహిత్యాభిలాషి, సాహిత్యాధ్యయనశీలి, సహృదయుడు, అజ్ఞాత రచయిత, సాహితీమిత్రులు శ్రీ కణుగుల వెంకటరావుగారిని సవర బులిటిన్ ప్రత్యేక సంచిక కోసం అనువాదం చేయమని కోరాను. వారుకూడ ఇది తనవంతు కర్తవ్యంగా స్వీకరించి అచిరకాలంలోనే అనువాదాన్ని పూర్తిచేసి అందించారు. ఈ అనువాదంకోసం వారు భాషాశాస్త్రానికి సంబంధించిన అనేక విషయాలు తెలుసుకొన్నారు. అంతర్జాతీయ ధ్వని లిపిని నేర్చుకొని అభ్యసించారు. వ్యాకరణానికి సంబంధించిన పారిభాషిక పదాలకు సరైన అనువాదం అందించారు. రామమూర్తిగారి భావాలను యథాతథంగా అందించడానికి వారు గొప్పకృషి చేశారు. వారికి కృతజ్ఞతలు.

మూలగ్రంథంలోని పరిమళాన్ని చూపించాలనే ఆలోచనతో ముద్రణ విషయంలో చాలా జాగ్రతలు తీసుకోవడం జరిగింది. పాదపీఠికలు ఇవ్వడంలోను, ఉద్ధరణవాక్యాలు చూపించడంలోను మూలగ్రంథాన్ని అనుసరించడం జరిగింది. ఈ పుస్తకంలో ఏవైనా తప్పులుంటే అందుకు బాధ్యులం మేమే. మూలరచయిత కాదు

సకాలంలో అందంగా ముద్రించిన మహోదయ గ్రాఫిక్స్ అధిపతి శ్రీ టి. వి. ఎస్. కిశోర్ సాయిగారికి, సిబ్బందికి కృతజ్ఞతలు.

చంద్రశేఖర రావు

# A MANUAL OF THE SO:RA: (OR SAVARA) LANGUAGE

BY

RAO SAHIB G. V. RAMAMURTI, B.A.

*A retired Teacher, Parlakimedi, South India*

**(Published under the authority of the Government of Madras)**



MADRAS

PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS

1931

TO
MY FRIEND
MISS A.C. MCA. MUNRO
THE MOST ENTHUSIASTIC
BENEVOLENT CHRISTIAN WOMAN
WORKING AMONG THE WILDEST, UNRECLAIMED
ABORIGINAL PEOPLE OF THE
SO:RA: TRIBE IN THE
MALARIOUS HILLY
TRACTS OF
GANJAM.

# గ్రంథకర్త ముందుమాట

గంజాం ఏజెన్సీ మధ్య దక్షిణ ప్రాంతంలోను, దానిని ఆనుకొని ఉన్న విశాఖపట్నం ఏజెన్సీలోను అనాదిగా జీవిస్తున్న ఆదిమవాసులను ప్రభుత్వ రికార్డులలో సవర, సౌర అనే వేరు వేరు పేర్లతో వ్యవహరిస్తున్నారు. కాని వారు మాత్రం 'సోర' అనే చెప్పుకుంటారు. వారి భాషకూ అదే పేరు. ఆ"సోర" అనే పేరునే ఈ మాన్యుయల్‌లో వాడుతున్నాను.[1] ఈ

---

1. so:ra: అనే మాటయొక్క ఉచ్చారణను అంతర్జాతీయ ధ్వని లిపిలో చక్కగా వ్రాయవచ్చు. so:ra: అనే మాటలోని రెండు అచ్చులను భారతీయ భాషలలోని అచ్చుల వలె పొడువుగా పలకాలి. ఇంగ్లీషు ' mate ' అనే మాటలోని ' a ' దీర్ఘము, భారతీయ భాషలలోని దీర్ఘము ఒకేవిధముగా వుండవు. ధ్వనిలిపిలో పొడవు 'a: ' అంటే పురాతన ఆంగ్ల ఆర్థోగ్రఫీలోని ' a: ' ని ' h ' తో కలిపి పలకడం. ప్రామాణిక (దక్షిణ) ఆంగ్లభాషలో స్వచ్ఛమైన దీర్ఘ ' o: ' లేదు. రోమను లిపిలో ' a ' అచ్చుకు పై నున్న గీత సాంప్రదాయ భారతీయ భాషలలోని దీర్ఘం వంటిదని సూచిస్తుంది. లిపిలేని భాషలలోని అచ్చుల పొడవును అది సూచించదు. బ్రిటిషు అధికారులు ఈ ' so:ra: ' అనే జాతి పేరును ఎన్నో విధాలుగా వ్రాశారు. Sowrah, Sowra, Saurah, Saura, Sourah, Soura, saora, Saoura, Sawara, Savara, Sabara, Savra, Sobor, Saor, మొ॥ నవి. పైన చెప్పిన వ్రాతలు (spelling) కొంతమంది వ్యక్తిగత సమీకరణనే కాకుండ, కొన్ని సవరల ఉచ్చారణను, కొన్ని ఒరియావారి ఉచ్చారణను, కొన్ని తెలుగువారి ఉచ్చారణను, మిగిలినవి సంస్కృత పండితుల ఉచ్చారణను తెలియజేసేవిగా ఉన్నాయి. 'శబర', లేక 'శబొరొ' అనే మాటలలోని 'శ' సంస్కృత పండితుల ఉచ్చారణలో తాలవ్యంగాను, తక్కినవారి ఉచ్చారణలో దంత్యంగాను వుంది. క్రీ.శ. మొదటి శతాబ్దానికి చెందిన ప్లినీ 'సుబరి' అని ఉచ్చరించాడు. క్రీ.శ. రెండవ శతాబ్దానికి చెందిన టోలమీ 'సబరఏ' అన్నాడు. ఐతరేయ బ్రాహ్మణంలోను, ఆతరువాత వచ్చిన సంస్కృత సాహిత్యంలోను ఆటవికులలోని ఒక జాతికి ఇచ్చిన పేరు 'శబర'. సోరభాషలోగాని, ఒరియాభాషలోగాని 'వ' ధ్వని లేదు. తెలుగు 'వ' ధ్వని ఇంగ్లీషు 'వ ' ధ్వనికి పూర్తిగా భిన్నము. ఇంగ్లీషు ఉచ్చారణ లోని 'వ' ధ్వని సవరలకు కటువుగా వినిపిస్తుంది. అధికార పత్రాలలో వారినిగాని, వారిభాషనుగాని, వారిసంస్థలనుగాని, వారి గ్రామాలనుగాని ఏ పేరుతో రాసుకున్నను చిక్కులేదు. మనము వారి మధ్య ఉంటే సోరాన్ (సవరవాడు), సోరాఞ్జి (సవరలు) అని; సోరాలెజన్ (సవరభాష) అని; సోరాబెర్ (సవరమాటలు) అని, సోరాగొర్‌జజ్ (సవరగ్రామము) అని, సోరాబోజన్ (సవరస్త్రీ) అని, సోరాసూజన్ (సవరల ఇల్లు) అని, సోరాలెన్ (సవరలం) అని, సోరాన్ అ ఓన్ (సవరపిల్లవాడు) అని అనగా సవర జాతివాడని, అర్సి(డ్)సోర్ అనగా అర్సి(డ్) అనే పేరుగల సవరజాతివాడని ఈవిధంగా యాదాలాపంగా అవసరంబట్టి సవరమాటలు వినిపిస్తాయి. ఆదేశంలో వారితో సంభాషించునపుడు వారి జాతిపేరును తప్పుగా పలికి వారి మనసును కష్టపెట్టే విధంగా ప్రవర్తించడంతప్పు. ఓఢ్రులు లంబలంజియ (పొడవుతోకలు) వంటి పేర్లతో వారిని పిలిచి, అపహాస్యంచేసి వారిని రెచ్చగొట్టడం అనుచితమని నేను తలుస్తాను. వారిని అవమానించుట వలన వారి విశ్వాసాన్ని మనమెప్పుడూ పొందలేము. సవరలు ఇటువంటి దూషణను నిరసిస్తారు. మరీ దట్టమైన అడవుల్లో నివసించేవారు వారి పేరును ' సో'ఒర'

సోరలు అధిక సంఖ్యలో పల్లపు ప్రాంతాలలో కూడ నివసిస్తున్నారు. హిందూ మతస్థులగుటకు వేరువేరు దశలలో సిద్ధముగా ఉన్నారు. 1921వ సం॥ జనాభా లెక్కల ప్రకారం సోర జనాభా 2,105,110. "ఈ ఏజెన్సీ ప్రాంతవాసులు వారి ఆదిమభాషను మానుకొని మరింత నాగరికత గల భాషల వైపు మొగ్గు చూపుతున్న రుజువు లేదు."[1] సోరలలోని కొందరు మరీ దట్టమైన అడవులలో ఉంటున్నారు. అవి పర్లాకిమిడి ఏజెన్సీలోని గుమ్మ, సెరంగో, ఒజ్జాయి గూడ ముఠా ప్రాంతాలు, గుణుపురం ఏజెన్సీలోని పొట్టసింగి ప్రాంతం. వీరు తమ గ్రామాలను అప్పుడప్పుడు మార్చుకుంటూ, దట్టమైన అడవులకు, ఇతరులకు అందుబాటులో లేని ఇరుకైన మారు మూలప్రాంతాలకు, బిస్సోయిలకు, వారి సిబ్బందికి దూరంగా తమ నివాసాలను ఏర్పరచుకుంటారు. సోర దేశంలో శాంతి భద్రతలను కాపాడే బాధ్యత బిస్సోయిలనే ఈ భూస్వామ్య ప్రధానులపై ఉంది. వీరికీబాధ్యత వంశపారంపర్యంగా సంక్రమించింది. వీరు, వీరి సిబ్బంది ఒరియా జాతివారు లేదా వారి జాతిలో కలిసిపోయిన ఆదివాసీలు. వారు ఒరియా భాషనే మాట్లాడగలరు. వారికి సోరలతో మంచి సంబంధాలు లేవు. సోరలు బిస్సోయిలుండే ముఖ్య కేంద్రాలలో ఉండవలసివస్తే ఒరియా వారితో కలిసి ఒకే వీధిలో ఉండరు. ఈ విరోధ వైఖరికి మూల కారణం ఆర్యులు, ద్రావిడులు వీరిని యుగయుగాలుగా అణచివేసి ఈనాటి ఈదుస్థితికి దిగజార్చడమే.[2] ఇప్పటికీ సోరలు వారిని పరాయివారిగానే అనుమానంతో చూస్తారు. పిరికి వారైనా వీరు ఉద్రేక స్వభావులు. వీరికిగల త్రాగుడు వ్యసనమే దీనికి కారణం. అందుచేత వీరు ఒక్కొకసారి ఎంతో ఘోరమైన నేరాలు చేస్తారు. బ్రిటిషుపాలనకు ముందు పల్లపు ప్రజలు ఈ పర్వత సోరల వలన గృహదహనాలకు, పంటల నష్టాలకు గురై సర్వనాశన మౌతుండేవారు. అంతకు ముందు పర్లాకిమిడిరాజు వీరిని

---

లేక 'స'ఓర' అని ఉచ్చరిస్తారు. "నేను వ్రాసినట్లుగా 'so'o:ra' మొదటి అచ్చుతరువాత కంఠమూలీయ అవరోధంవుంచి, ఊనిక ఏమైనా ఉంటే దానిని రెండవ అచ్చు(ఒ) మీద ఉంచాలి." అని సి.హేండర్‌సన్ గారు అన్నారు. మిస్. మన్రో, నేను అప్పుడప్పుడూ ఈ ఉచ్చారణ వినేవాళ్లం, కాని సోరా అనేదే సాధారణమని గ్రహించాము. (ఆస్టిన్ గారి రిమార్కు - 22 పే చూడండి.)

1.జనాభా లెక్కల రిపోర్టు. సంపుటి 13. మొదటి భాగం.

2.మజుందార్ సంపాదకత్వంలోని "టోలమీ ఇన్ ఏన్షియంట్ ఇండియా" లో 14, 173, 209 పేజీలు; విశ్వ భారతి సంపుటి 2 లో ప్రొఫెసర్ సునీత్ కుమార్ చటర్జీ వ్రాసిన "అవర్ ఎల్డర్ బ్రదర్స్-ద కోల్ పీపుల్" (కోల్ ప్రజలు-మనఅన్నలు); కలకత్తా విశ్వవిద్యాలయం అనువదించి ప్రచురించిన ప్రొఫెసర్ సిల్‌వెయిన్ లెవి, జీన్ ప్రిలుస్కీ, మరియు యూల్సు బ్లాక్ లు వ్రాసిన "ప్రీ-ఆర్యన్ ప్రీ-ద్రవిడియన్" గ్రంథాలు చూడండి.

అణచివేయుటకు పెట్టిన దారుణ హింసలకు ఆ విధంగా బదులు తీర్చుకొనేవారు.[1] గత శతాబ్దంలో ఈ ఏజెన్సీ ప్రాంతం బ్రిటిషు పాలన క్రిందికి వచ్చిన తరువాత వారు ఈ సోర దేశంలోనికి అనేక శిక్షాత్మక దండ యాత్రలను సాగించారు. అవి ఎంతగా వీరిని క్షోభకు గురిచేశాయంటే, ఈ సోరలు చాలా కాలం పల్లపు సంతలకు వెళ్ళడం మానుకున్నారు. పల్లపు వర్తకులు ఏజెన్సీలో అడుగు పెట్టడానికే భయపడిపోయారు. డబ్ల్యు. ఎఫ్. గ్రాహం ఐ.సి.యస్ గారు వారి 1875వ సం॥ రిపోర్టులో ఈ విధంగా రాశారు.[2] "సోరలు ఇప్పుడు ప్రశాంతంగా జీవిస్తున్నా, ఒక్కొక సారి క్రూరంగా వ్యవహరించగలరు. నేను బ్రెజిలు అడవులలో ఉంటున్న కాబోకలులను, బొటాడోలనువారు ఉన్న చోటనే చూచాను. నాకు తెలిసిన ఆటవిక తెగలలో సోరలే హీనమైనవారు. ఈ శతాబ్దంలో సోర దేశంలో చిన్న చిన్న పోరాటాలు అనేకం జరిగాయి. న్యాయమైన పరిపాలన లేకపోతే అవి ఇంకా ఎక్కువౌతాయి." అని ఫ్రెడ్. ఫాసెట్ గారన్నారు. ఇప్పటికీ సోరలలో చిన్న చిన్న తిరుగుబాట్లు, వారిపై పోలీసు దాడులు జరుగుతూనే ఉన్నాయి. వీరిని విధేయులుగా ఉంచుటకు, అక్కడ ప్రశాంత వాతావరణం నెలకొల్పుటకు ఒక్కొక సారి జిల్లా అధికారులే స్వయంగా దాడులు నిర్వహిస్తున్నారు. ప్రభుత్వ ఉత్తర్వులు వీరికి అనుకూలంగా లేకపోతే వాటిని పాటించుటకు నిరాకరించి ప్రభుత్వాన్ని ధిక్కరించుటకు వీరు వెనుదీయరు. వీరిని రెచ్చగొడితే గవర్నరు ఏజెంటు అని కూడ లెక్క చేయక ఎదురు తిరుగుతారు.

---

1. 1868-69, 1875-76 మన్యం నివేదికలు (ఏజెన్సీ రిపోర్టులు) చూడండి. రస్సెల్ నివేదిక మొదటి వాల్యూం, 31 వ పేజీ. - 1822వ సంవత్సరంలో పర్లాకిమిడి జమీందారీని రాజుగారికి (ప్రస్తుత రాజుగారి ముత్తాతకు) దఖలుపరిచినపుడు అతని నౌకర్లు మానవ జాతికే అవమానకరమనిపించే దారుణాలను వారిపై చేశారు. వారిని కొల్లగొట్టి దండయాత్రలో అయిదుగురు సవరలును బంధించి చంపారు. వారి తలలను మొండెముల నుండి వేరు చేసి పర్లాకిమిడికి నాలుగు వైపులా వ్రేలాడగట్టారు.

2. డిస్ట్రిక్ట్ గజీటీర్ 258 పేజీలో ఈక్రింది సంఘటనను గ్రాహం గారు వివరంగా పేర్కొన్నారు. "జూలై 1864లో సవరలతో విపత్తు ఏర్పడింది. పొట్టసింగి పోలీస్ వారు సవర ప్రధానులలో ఒకరిని కారణం లేకుండా నిర్బంధించారు. ఆగ్రామస్థులు అతనిని విడిపించి, ఇన్స్పెక్టర్‌ని, నలుగురు కానిస్టేబుల్స్‌ని చంపి పోలీస్ స్టేషన్‌ను తగలబెట్టారు. జైపూర్ రాజావారిని వారి పలుకుబడి ఉపయోగించి ఇందుకు బాధ్యులైన వారిని అరెస్టు చేయుటకు వీలు కల్పించాలని పోలీసులు కోరారు. జల్తార్‌లో అయిదుగురుని ఉరి తీశారు. 1865లో కొండలలో ఒక పోలీసు స్థావరంను ఏర్పాటు చేయుటకు ఒక పోలీసు బృందం వెళ్లగా దానిని ఎదిరించి వెనక్కి మరలేటట్టు చేశారు. అప్పుడు పెద్ద పోలీసు బలగాన్ని కూర్చుకొని, చిన్నదైనా, ఎంతో క్షోభ కలిగించే దాడిచేసి 1866 జనవరిలో ఆ

అందువలన శాస్త్రీయమైన అన్వేషణకు, సోర దేశము లోని ఈ పరిస్థితులు అనుకూలమైనవికావు.[1]

అందుచేత పోలీసు సూపరింటెండెంట్ అయిన ఫ్రెడరిక్ ఫాసెటగారు సోరలగురించి "ప్రపంచానికేమీ తెలియదు"[2] అని చెప్పారంటే దానికి ఆశ్చర్యపడనక్కరలేదు. ఇండియా ఇంపీరియల్ గెజెటీర్‌లో డబ్ల్యు. డబ్ల్యు. హంటరుగారు వీరిగురించి కేవలం రెండున్నర పంక్తులే రాశారు. "ఈ సోరలు కొలారియన్ తెగకు చెందిన వారు. కొంత పదజాలం తప్ప, వీరి భాష ఇతరులెవరికీ తెలియదు" అని "మద్రాసు పరిపాలన మాన్యుయల్‌లో ఉంది." ఫాసెట్ బ్రిటిష్ అధికారి మాత్రం సోరల ఆచారాలను, మతకర్మలను ఇతరులు అధ్యయనం చేసే అవకాశాలను అభివృద్ధి పరిచాడు. ఆ అధ్యయన ఫలితాలను "మద్రాసు సోరలు" అను పత్రంలో ప్రకటించాడు.[3] ఈ పత్రము, "సోరల మానవ జాతి శాస్త్రము" అని నేను తయారు చేసిన నోట్సు ఆ తరువాత "మద్రాసు రాష్ట్రంలోని కులాలు తెగలు" అను థర్‌స్టన్ గారి వ్యాసానికి ఆధారమైనవి.

ఈ ఏజెన్సీలో విస్తృతంగా పర్యటించిన రెండవవ్యక్తి, లీప్సిగ్ రాష్ట్ర పరిశోధన సంస్థ తరుపున మానవ జాతి శాస్త్ర సహయాత్ర చేసిన డా॥ బేరన్ వాన్ ఐక్ స్టెడ్ గారు. వీరు 1927 వ సం॥లో సవరల శారీరక ఆకారము, భౌతిక నాగరికతను అధ్యయనము చేయుటకు వచ్చారు. వీరికి ఆ సంస్థ అందజేసిన ధన సహాయముతో పాటు స్థానిక ప్రభుత్వ సహాయము

---

స్థావరాన్ని స్థిరంగా హస్తగతం చేసుకొన్నారు. ఆ తరువాత ఆ కొండసవరలు అనేక సంవత్సరాలు భయపడి వీరిని అనుమానంతో చూశారు.

1. భారతదేశ శాసన సంబంధ కమిటీ రిపోర్టు (సంపుటి 2) ఇటీవలే ప్రచురింప బడింది. అందులో "ఈ తెగలవారు వారి సొంత ఆటవిక మూఢ నమ్మకాలను అనుసరిస్తారు. ఇంతవరకు వారిదేశం అభివృద్ధికి నోచుకోలేదు. వారు దురాక్రమణకు దిగే స్వభావం కలవారు కాకపోయినా తేలికగా ఉద్రేక పడగలరు. ఆర్థిక పీడనపైన, అనుచితమైన పరిపాలనా శాసనములపైన గల వ్యతిరేకతతో తేలికగా కలకలాన్ని సృష్టించగలరు. చివరసారిగా 1922లో స్థానికంగా తిరుగుబాటు జరిగింది. దానిని 2 సంవత్సరాల తరువాత శక్తివంతమైన అస్సాం రైఫిల్స్ సైన్యసహాయంతో అణిచివేయగలిగాము." అంటూ అందులో ఈ ఏజెన్సీ ప్రాంతంలోనున్న ఆదివాసీజాతుల స్వభావంయొక్క తాజాప్రామాణిక సమాచారం క్లుప్తంగా వ్రాశారు.

2. చూడు 'మద్రాసు సవరలు' (The Soaras of Madras) అను పత్రం

3. బోంబే ఆసియాటిక్ సొసైటీ జర్నల్‌వాల్యూం-1 (The Journal of A.S. Bombay.)

కూడ ఉన్నందున వారు, వారిభార్య, నౌకర్లతో కొన్ని వారాలపాటు సెరంగో ముఠాలో గడపగలిగారు. అదృష్టవశాత్తూ ఆ సమయములో ఆ ప్రాంతమందు ఎటువంటి అలజడులు తలెత్తలేదు.

సోరల భౌతిక నాగరికతను, శారీరక ఆకారములను, వివాహ ఆచారాలను, దహనక్రియలను తెలుసుకొనుట కన్నను, వారి భాష గురించి తెలుసుకొనుట చాల కష్టమైన పని. వారి భాషపై ఆధిపత్యం సంపాదించాలంటే వారితో చాలా కాలం సదా కలసిమెలసి ఉండాలి. వంశపారంపర్య పర్వత ప్రధానులయిన బిస్సోయిలు తరతరలుగా సవర దేశంలో స్థిరపడి దాదాపు ప్రతి దినమూ వారితో లావాదేవీలు జరుపుతున్నప్పటికీ, వారికి సోరభాష రాదు. గత సంవత్సరం జరిగిన గవర్నరు ప్రతినిధి దర్బారులో కేవలం ఒక్కనికే, అదీ అరకొరగానే, ఆ భాష తెలుసు. బిస్సోయిల సిబ్బంది, సోరల తో నిత్యం వ్యవహారం జరుపుటకు తగినంత భాషనే నేర్చుకున్నారు. దానిని "ఒరియా సోర " లేదా "డొంబ సోర" అని పిలుస్తారు.[1] అధికారిక దుబాసీలకు తెలిసినసోర భాష కూడ అంతంత మాత్రమే. పైగా వారికి చదువు రాదు.[2] ఒరియా గాని, తెలుగు గాని రాని ఉద్యోగస్థులు ఏవైనా ప్రత్యేక దర్యాప్తులు జరిపితే వారికి రెండు లేదా మూడు భాషలలో అనువాదం చేయగలిగేవారు కావాలి. మొదట సోర భాషనుండి ఒరియా భాషకు తర్జుమా కావాలి. తరువాత ఒరియా నుండి తెలుగులోనికి మరల తెలుగులో నుండి ఇంగ్లీషు భాషకు తర్జుమా చెయ్యాలి. కారణం ఇంగ్లీషు, సోర, ఒరియా, 'ఈ మూడు భాషలను తెలిసిన వారు లేనేలేరు గనుక'.[3] "ఎంతో వైవిధ్యం గల ఈ భాషల వలన పరిపాలన ప్రతిబంధక మౌతున్నది. ఆభాషలనన్నిటినీ అధ్యయనము చేసినవారు లేనందున, ఆ భాషలు అక్షరబద్ధం కానందున ఈ పరిస్థితి మరింత జటిలమౌతున్నది. సోరదేశం దుర్గమ ప్రదేశమయినందున అక్కడ నివసించే ప్రజలకు ఇతరులతో సంబంధాలు లేక ఏకాకులగుటవలన ఈ భాషకు అనేక స్థానిక మాండలికాలు ఏర్పడినాయి."[3] "పోలీసులను వేధిస్తున్న ముఖ్యసమస్య సోర, ఖోండు వంటి ఆదివాసీ భాషలు

---

1. "Reading Lesson I" (చదువుకొనే పాఠం: 1) పేరాగ్రాఫ్ 16.

2. న్యాయస్థానాలలో సవరలు ఇచ్చిన వాఙ్మూలాలను వారి భాషలలో రాయరు. మరణశిక్షకు గురైన ఒక సవర వాజ్యం (కేసు)లో న్యాయ పరమైన కార్యకలాపాలు నిర్వహించినపుడు ఒక అవరోధం ఏర్పడింది. అప్పుడు హైకోర్టు మాతృ భాషలోనే రాయబడిన సవర వాఙ్మూలము కావాలన్నారు. "ఏ ఐరోపా దేశస్థుడు ఈ భాషలో పరిపూర్ణత సాధించలేదు. దానికి వ్రాతలేదు" అంటూ 'మద్రాసు సోరలు' (The Soaras of Madras) అను పత్రంలో ఫాసెట్‌గారు రాశారు.

3. జిల్లా గజిటీర్

వారికి తెలియక పోవడమే."[1] "దిగువ స్థాయి పోలీసుఉద్యోగులు వారు పనిచేస్తున్న ప్రాంత
ప్రజలు ఆచార వ్యవహారాలను, సంప్రదాయాలను, భాషను తెలుసుకోవాలని" రాయ్‌బహదూర్ ఎన్. రాయ్ గారు కమిషన్ ఎదుట సాక్ష్యమిచ్చారు. పోలీసు ఇన్స్‌పెక్టర్ జనరల్ వాల్టర్ స్వెయిన్ ఈ అభిప్రాయంతో ఏకీభవించారు."[2] వాస్తవానికి ఏజన్సీలో పనిచేస్తున్న అన్ని శాఖల పరిపాలనాధికారులకు, సోర భాష తెలియకపోవడం ప్రధాన లోపముగా ఉంది. ఎఫ్. ఎ. కోల్‌రెడ్జి అనువారు ఆరోగ్య అధికారులు. టీకాలు వేసేవానితో సహా ఆసుపత్రి సహాయకుల గురించి 1900 వ సం॥ లో ఈ విధంగా అన్నారు. "ఈ కొండజాతుల భాషలు ఏ మాత్రం తెలిసినా దానివలన ప్రజల మనసులు తేలికపడడమే కాకుండ, సేవలందించే వారిపై విశ్వాసమునూ కలుగుతుంది."

ఉపాధ్యాయులకు సోరభాష తెలియక పోవడం వలన అందరికంటె వారికి ఎక్కువ హానికరం. వారికి సోర భాషరానందున సోరలకు చదువు నేర్పుటలో వారు పూర్తిగా విఫలమయ్యారు. సోరలకు చదువు చెప్పుటకొరకు ఈ ఉపాధ్యాయులపై వెచ్చించిన ధనమంతా వృధాఅయినట్లే. "ఇంతవరకు సోరలకు చేరువ కాలేక పోయినాము. వీరికి ఒరియా భాషరానందున ఒక్కడు కూడ బడికి రాడు. సోరలు మాత్రమే నివసించే గ్రామాలలో ఈ సంవత్సరం ఏడు బడులను ప్రారంభించవలెనన్న నా పథకము అందుచేతనే విరమించుకో 'వలసివచ్చింది. సవర భాష తెలిసిన ఉపాధ్యాయుడు ఒక్కడూ లభించకపోవడమే దీనికి కారణం" అని ఎ. గెలెటి ఐ.సి. యస్. గారు 1925 వ సం॥ నకు సంబంధించిన తమ పరిపాలనా నివేదికలో రాశారు. సోరలకు చదువు నేర్పుటకు పాఠశాలలు ప్రారంభించిన నాటినుండి, అనగా 1857 నుండి 1931 వరకు ఎదురైన సమస్య ఇదే.

---

1. జిల్లా గజేటీర్

2. పోలీసువారి తెలివితక్కువను తెలియజేసే ఒక సంఘటనను రాయ్ గారు వివరించారు. ముండాలు వారి సొంత రాజును ఎన్నుకొంటున్నారంటూ ఒక హెచ్చరికను ఒక అధికారి పంపించారు. సోరా మన్యంలోని పోలీసుకు సంబంధించి ఇటువంటి అనేక సంఘటలను, కొన్ని మరీ శోచనీయమైనవి ఈ నివేదికలలో వివరించబడినాయి. ఉదాహరణకు ఒక అమ్మాయి వివాహమునకు సంబంధించి రెండు గ్రామాలమధ్య జరిగిన వివాదమును పల్లపు ప్రాంతాన్ని ముట్టడించుటకు సరిహద్దులోని సవరలందరూ యుద్ధసన్నదులౌతున్నట్లుగా భావించి, అందుకు గంజాం నుండి 450 మంది పోలీసులను, దానికి రెండు రెట్లుగా అటువంటి మనుషులను, అదే నిష్పత్తిలో ఈ జిల్లా నుండి ఇతరులను తెప్పించి శత్రువుపై యుద్ధానికి మోహరించారు. దీనివలన 1866 లో ప్రారంభమైన ఈ తిరుగుబాటు ఈ తెగలతో సంప్రదింపులు జరిగేవరకు సాగుతూనేవుంది.

రహదారులు, గుర్రపు దారులు వంతెనలు, తూములు ఎంతోఖర్చుతో నిర్మించి ఏజెన్సీ ప్రాంతాలలో రాక పోకలు ఏర్పాటు చేసినప్పటికి సోర భాషరానందువ అతని ఇంటి ముంగిట అతనికి ఎదురుగా నిలబడి కూడ అతనికి చేరువకాలేక పోయాము.

నాకంటె ముందు ఎవరూ సవర భాషను నేర్చుకోలేదు. యూరోపియన్ అధికారులలో డబ్ల్యు. ఎఫ్. గ్రాహం ఐ.సి.యస్ మాత్రమే ఈ భాషను నేర్చుకొనుటకు 1875 సంాలో వ్యర్థ ప్రయత్నం చేసినట్లు తెలుస్తున్నది.[1] గంజాం జిల్లా గవర్నరు ప్రతినిధి అయిన హెచ్. డి. టేలరు ఐ.సి.ఎస్. గారు 1900సంాలో సోరభాషను నేర్చుకునే ప్రభుత్వ ఉద్యోగులకు పారితోషికములివ్వవలెనని సూచించారు. ఈ భాష నేర్చుకొనుట సులభమని కూడ వారన్నారు. "సవర భాషలో కేవలం 700 మాటలే ఉన్నవని నా అభిప్రాయము. వీటిని నేర్చుకొనుట
కష్టమేమీకాదు. అయితే దీనిని కొండ జాతి వారే మాట్లాడుతారు....." ఇది 700 పదాలు మాత్రమే ఉన్న భాషా? నేర్చుకొనుట కష్టంకాదా? అయితే ఆ భాషపై అభిమానం వలన గాని, డబ్బుకోసంగాని ఎవరూ ఇంత కాలం ఎందుకు నేర్చుకోలేదు? గంజాంలో ఎంతో కాలం ఉన్న ఈ టేలరు గారు కూడ ఈ 700 మాటలను ఎందుకు నేర్వలేదు? "శిక్షణ పొందిన భాషా శాస్త్రజ్ఞులెవరూ ఈ వెనుకబడిన భాషలలో గాని, వాటి మాండలికాలలో గాని కృషి చెయ్యలేదు. ఎంతో విశాల క్షేత్రము పరిశోధనకు ఎదురుచూచుచున్నది." అని విశాఖపట్నం డిస్ట్రిక్టు గెజిటీర్‌లో ఎందుకు రాయవలసి వచ్చింది?"

వాస్తవ మేమంటే, ఈ సోరలతోకలిసిపోయి, ఎంతో కాలం వారితో జీవిస్తే తప్ప ఈ భాషను నేర్చుకోలేము. కాని కొండలలో జీవిస్తున్న ఒరియావారు చివరికి బిస్సోయి సిబ్బంది కూడా సోరలను క్రూర జంతువులుగానే భావిస్తారు. ఒరియా ఉపాధ్యాయులు సోరబాలురను ఏ విధంగా ఆదరించేదీ గవర్నరు ప్రతినిది ఎన్. మెక్‌మైకేల్ ఐ.సి.ఎస్ 1910 వ సంాలో తమ నివేదికలో ఈ విధంగా చెప్పారు. "ఒరియా ఉపాధ్యాయులు ఖోండులను, సోరలను అతి హీనంగా చూస్తారు. కావున వారెవరూ ఒరియా పాఠశాలలో చదువుకొనుటకు రాక పోవడంలో ఆశ్చర్యంలేదు."

ఏజెన్సీలో పనిచేస్తున్న ఉపాధ్యాయులు విద్యావంతులు, భాషావేత్తలు కారు. లిపిలేని సోర వంటి భాషను నేర్చుకొనే సమర్థులు కూడ కారు. వాచకాలు, మాన్యువల్సు, వ్యాకరణాలు, ...

---

1. తన రిపోర్టులో అతనీవిధంగా అన్నారు. " నేను మలియాలో ఉండగా, సోరభాషను నేర్చుకొనుటకు దాని శబ్దజాలాన్ని కొంత సంపాదించడానికి శ్రమపడితిని. ఆభాష నా కంత కష్టమనిపించలేదు." ప్రభుత్వం అతనిని ప్రోత్సహించినప్పటికీ అతను ఆభాషను నేర్చుకొనుటలో ఎటువంటి అభివృద్ధి సాధించలేదు.

నిఘంటువులు దగ్గరుంచుకొని బోధకుల వద్ద విదేశీభాషలను నేర్చుకునే విద్యావంతులకు ఎక్కడో దుర్గమమైన అడవులలో ఉంటున్న ఆటవిక జనులు మాట్లాడే భాషను నేర్చుకొనుటలో గల కష్టాలు ఎంతమాత్రమూ తెలియవు. భారత ప్రభుత్వము తన ధనాన్ని, పలుకుబడిని ప్రాబల్యాలను పూర్తిగా వినియోగించికూడ లింగ్విస్టిక్ సర్వే ఆఫ ఇండియా కొరకు అనేక భాషల నమూనాలను సంగ్రహించలేక పోయింది."[1]

సోర భాష ఒరియా లేదా ఇతర ఆర్యభాషల వంటిదికాదు, తెలుగు లేదా ఇతర ద్రావిడ భాషల వంటిదికాదు. ఇంగ్లీషు భాషవంటిదీ కాదు. అది ముండా లేదా కొలారియన్ కుటుంబానికి చెందినది. ఈ భాషా కుటుంబంలో సంతాలి, ముండారి వంటి పదహారు మాండలిక భాషలున్నాయి. ఈ మాండలిక భాషలను మాట్లాడేవారు అధికంగా చోటా నాగపూర్‌లో ఉన్నారు. మిగిలిన వారు ఒరిస్సా, గంజాం, విశాఖ పట్నం ప్రాంతాలలో ఉన్నారు. ఈ భాషలకు అస్సాంలో మాట్లాడే ఖాసీ భాషకు, అస్సాంకు ఆవలనున్న భారత దేశపు 'మోన్-ఖ్మెర్' భాషకు సంబంధం ఉంది. ఈ భాషలన్నీ కూడ ఆస్ట్రిక్ భాషా కుటుంబానికి చెందినవని పాటర్ డబ్ల్యు. స్మిత్ అనే ఆస్ట్రియా దేశస్థుడు రుజువు చేశాడు. ఈ భాషా కుటుంబం ఇతర భాషల సముదాయాలకంటె అధికంగా ప్రపంచంలో విస్తరించింది. ఈ భాషలు మాట్లాడేవారు భారతదేశానికి దగ్గరలోను, దూరంగాను ఉన్న ప్రాంతాలలో చెదురుమదురుగా ఉండడమే కాకుండ, ఇండోనేషియా, మేలనీషియా, పోలనేషియా, మడగాస్కర్, న్యూజిలాండ్ వంటి దూర దేశాలలో కూడ నివసిస్తున్నారు. అంతేకాదు, మెడగాస్కర్ నుండి దక్షిణ అమెరికాకు 40 డిగ్రీల దూరంలోనున్న ఆఫ్రికా తీరంలోని ఈస్టర్ ద్వీపం వరకూ విస్తరించి ఉన్నారు. ఉత్తరాన ఈ భాషా కుటుంబ చిహ్నాలు పంజాబు కన్వర్‌లో లభించగా దక్షిణాన న్యూజీలాండ్ వరకు లభిస్తున్నాయి. ఈస్టర్‌ద్వీపానికి పశ్చిమాన
ఆస్ట్రేలియా, న్యూగినియా లోని కొంత ప్రాంతం మినహా మొత్తం పసిఫిక్ సముద్ర ప్రాంతమంతా ఈ భాషా కుటుంబ చిహ్నాలు వ్యాపించి ఉన్నాయి.[2]

---

1. లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా రికార్డులో "తెలియని అనేక భాషలు ఇంకా ఉన్నాయి అంటూ సర్ జార్జ్ గ్రియర్సన్ గారు తమ విచారాన్ని వెలిబుచ్చారు. ఆష్‌కుంద్ మాండలికం గురించి మనకేమాత్రమూ తెలియదు అని వారన్నారు..... వాయువ్య సరిహద్దులలోని నా మిత్రుల ప్రయత్నాలన్నీ ఆ భాష యొక్క నమూనాలను సేకరించడంలో విఫలమయినాయి. (సంపుటి8 2- పేజి 6). పుర్నియాలోని తారుస్ మాట్లాడే గా ఓవరి మాండలికం గురించి వ్రాస్తూ 'వారు ఎంత క్రూరులంటే లింగిస్టిక్ సర్వే కొరకు వారి నుంచి ఎటువంటి నమూనాలను సంపాదించడం సాధ్యం కాలేదు.' (వాల్యూం 5- 2 పేజీ 86). సంపాదించిన కొన్ని భాషల నమూనాలు తప్పుల తడకలు. కావున వాటిని ఉపయోగించునపుడు విద్యార్థులు ఎంతో జాగ్రత్త వహించాలి."

2. లింగ్విస్టిక్ సర్వే 1-1, పేజీ 32

సోర భాషను నేర్చుకొనడం నా కెంతో కష్టమయిన పనిగా తోచింది. ఆ భాషకు చెందిన కొన్ని ముఖ్యలక్షణాలను గ్రహించుటకు నాకు ముప్పది సంవత్సరాలకుపైనే పట్టింది.(ఈ భాషయొక్క పదజాలం 700మాటలు కాదు. 7000 మించిన సంఖ్యలో ఉన్నాయి.) ఇంకా నేను పరిష్కరించవలసిన సమస్యలెన్నో ఉన్నాయి. వాటన్నిటినీ నేను పరిష్కరించలేనేమో అని భయపడుచున్నాను. నేను సోర భాషను నేర్చుకొనుటకు ఎంతకష్టపడిందీ ఇక్కడ వివరించే సమయము కాదు. వచ్చే సంవత్సరము ప్రచురించే సోర-ఇంగ్లీషు నిఘంటువుకు పీఠిక వ్రాయునపుడు నేను పడిన శ్రమను వివరిస్తాను. ఇప్పుడు సోర భాషను నేర్చుకొనువారికి నేను పడిన శ్రమంతా తప్పిపోయింది. ఒక ఏడాదిలోనే వారుసోర భాషలో మంచి జ్ఞానాన్ని సంపాదించగలరు. నేను చేసిన దానిని మెరుగు పరచగలరు. నేను చేసినది ఎంత మాత్రమూ పరిపూర్ణమైనది కాదని నాకు తెలుసును.

ఈ సోర మాన్యుయల్‌ను తయారు చేయుటకుగల నా ముఖ్యోద్దేశము ఇంగ్లీషు తెలిసిన ఉన్నత పభుత్వ అధికారులకు ఉపయోగపడుట. సోర ఏజెన్సీలోపరిపాలన జరిగే అన్నిపభుత్వ శాఖలలో పనిచేయువారికి కూడ ఉపయోగపడవలెను. వారు సోరభాషను నేర్చుకొంటే సోరలతో నేరుగా వ్యవహరించవీలవుతుంది. సోరభాషలో పరీక్షలు రాసి ఉత్తీర్ణులయిన వారికి పారితోషికాలు కూడ ఉన్నాయి.

అంతర్జాతీయ ధ్వని సంబంధ సంస్థ ఆమోదించిన ధ్వని సంకేతాలు ఇప్పుడు ఎంతో వ్యాప్తిలోకి వచ్చాయి. సోర భాషా శబ్దాలకు నేనా ధ్వని సంకేతాలనే ఈ మాన్యువల్‌లో ఉపయోగించాను. "లిపి రహిత భాషలను వ్రాతలో తెలుపుటకు అనేక సంవత్సరాల ఆచరణాత్మక అనుభవమును ఆధారము చేసుకొని ఎంతో మంది భాషాశాస్త్రవేత్తలు కలిసి ఈ ధ్వని సంకేతాలను నిర్ణయించారు."[1] సోరలకు సంప్రదాయ అక్షరమాలలేదు. ఏ భారతీయ అక్షరమాల పరిపూర్ణమైనదికాదు. ఇచ్చట సొంత అభిప్రాయాలకు తావులేదు. నేను 1912-14 సం॥లలో తెలుగు అక్షరాలతో సిద్ధంచేసిన సోర వాచకాలు తెలుగురాని ఒరియావారికి ఉపయోగపడలేదు. "పాశ్చాత్య విద్యార్థులకు అవి ఉపయోగపడవు"[2] అని సర్ జార్జిగ్రియర్ సన్ గారు అన్నారు. ఒరియా అక్షరమాలను అటు పాలకులు ఇటు పండితులు సమానంగానే తిరస్కరించారు. "అతివికారమైన,వ్రాయుటకు అతి కష్టమయిన ఒరియా అక్షరాలు ఆ భాషకు గుదిబండగా పరిణమించాయి. ఒరియా భాషను అచ్చుల చదవాలంటే

---

1. మానవ జాతి శాస్త్రము యొక్క పత్రాలలో- ప్రశ్నలు.
2. లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా, 1.-1. పేజి 35

కంటిచూపు ఎంతో బాగుండాలి. ఒరియా పుస్తకాన్ని యాదాలాపంగా చూచిన వారికి అందులో అక్షరాలు కేవలం వంపులు గానే కనిపిస్తాయి. రెండవసారి చూస్తేగాని లోపల ఉన్నవి కనబడవు." అని మద్రాసు పరిపాలనా సంబంధ మాన్యుయల్‌లో, పూరీ జిల్లా గెజిటీర్‌లో వ్రాశారు.[1] మిడ్నాపూర్‌లో "ఒరియా అక్షరాలను కాదని బెంగాలీ అక్షరాలనే వాడుతున్నారు." బస్తరులోఒరియా భాషకు దేవనాగరి లిపిని వాడుతారు. ఒరియా అక్షరమాలలోని తొలి అక్షరము మామూలుగావచ్చే 'అ' ధ్వనితో ప్రారంభము కాదు. ఇంగ్లీషు 'హాట్ 'అనే మాటలోని అచ్చు ఎలా వినిపిస్తుందో అలా ఉంటుంది. ఈధ్వని ఒరియా అక్షరమాలలోని ప్రతి హల్లులోను స్వాభావికముగా ఉంటుంది. ఒరియా మాటలలోచాల తరచుగా వినిపిస్తుంది.[2] ఒరియా అక్షరమాల సోర భాషకు ఉపయోగపడదు. దేవనాగరలిపి కూడ ఈ భాషకు తగనిదని భాషా పరిశీలనలో తేలింది. కుమాసీ భాషలోని అచ్చు శబ్దాలను మామూలు దేవనాగరిలిపిలో చూపలేము. నేను వాడిన నమూనాలను ప్రతి లిఖించగా వాటి ఉచ్చారణ
అసంపూర్తిగాను, ఒక్కొకసారి తప్పుదోవ పట్టించేదిగాను ఉంది. ఆ భాషావ్యాకరణము ఒక్కొకసారి ధ్వనుల మార్పుపై ఆధారపడి ఉంటుంది. ఆ ధ్వనులను పూర్తిగా రాతలో చూపలేము."[3]

---

1. జిల్లా గెజట్ , పూరి, పేజీ 69

2. కీ॥శే. ఎ.సి.డఫ్, ఐ.సి. ఎస్. గారు ఖోండు భాషకు ఒరియా అక్షరాల వాడకాన్ని త్రోసిపుచ్చారు. వారి అభిప్రాయం సవర భాషకు కూడ వర్తిస్తుంది. 1911 లో వారు ఖోండ్ భాషకు ఒరియా అక్షరాల వాడకం గురించి ఈ విధంగా వివరించారు. "అది ఏవిధంగా సాధ్యమో నాకు తెలియదని నేను అంగీకరిస్తున్నాను. ఒరియా భాషలో కురచ 'అ' అక్షరం లేదు. కాని ఖోండు భాషలో పొట్టి 'అ' పొడవు 'అ' కు గల ఒక్క బేధము వలన ఆ భాషలో 'ఔను' లేదా 'కాదు' అనే అభిప్రాయము విదితమవుతుంది. మాటలలో తెలియజేసే అంత ముఖ్యమైన తేడాను వ్రాతలో తెలియజేయలేని లిపి నాదృష్టిలో తిరస్కరించదగినది. ఈ ఒక్క ఇబ్బందే కాదు. అయితే అన్నిటికంటె ఇదే చాల తీవ్రమైనది. ఆమధ్య నేను ఒక ఖోండుకు ఆ భాషలో చెప్పిన వాక్యాన్ని ఒరియా అక్షరాలలో వ్రాయమని కోరాను. అతడు సహజంగానే ఖోండ్ కురచ 'అ' కొరకు దీర్ఘాక్షరాన్నే వాడాడు. అందువలన దీర్ఘ 'ఆ' కు మరి వేరే అక్షరం లేకపోయింది." సెరంగోలోని గవర్నమెంట్ ట్రయినింగ్ స్కూలులో నా వద్ద సవర నేర్చుకున్న ఉపాధ్యాయులు సవర పదాలను ఒరియా అక్షరాలలో వ్రాయునపుడు కలిగే గందరగోళాన్ని వదిలించుకోవడం అసాధ్యమైపోతున్నదంటూ ఏజెంటుగారి అభిప్రాయాన్ని అంగీకరించారు.

3. లింగ్విస్టిక్ సర్వే 9, 4

'లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా' రికార్డులలో రోమను లిపినే వాడారు. అయితే అందులోని లోపాలు స్పష్టంగా కనబడతాయి. అనేక రకాల ధ్వనులకు ఒకే అక్షరం వాడవలసి వచ్చినపుడు దానిని ఎన్నో గుర్తులతో వివరించవలసి వస్తుంది. ఉదాహరణకు నాలుగు విధాలైన 'అ', 'ఐ', 'ఔ', ధ్వనులకు ఒకే అక్షరం వాడుతాము. "మానసిక శాస్త్రవేత్త, ఉపాధ్యాయుడు, అచ్చుఅక్షరాలనుపోత పోయువాడు వీటిని త్రోసిపుచ్చుతాడు."[1]

ధ్వని సంబంధిత అక్షరమాల కూడ ఉజ్జాయింపుగా ఉండేదే అని విద్యార్థి గ్రహించాలి. వినికిడిధ్వనులను కనబడుసంకేతాలేవీ నిర్దుష్టంగా నివేదించలేవు. ముందుగా భాషాధ్వనుల ఉచ్చారణను సోరలవద్ద నేర్చుకోవాలి. తరువాత మాన్యుయల్‌లోని ఉదాహరణలలో ఇచ్చిన మాటలను వాక్యాలను వారివద్ద చక్కగా ఉచ్చరించేదాకా మళ్ళీ మళ్ళీ అంటుండాలి. సోర అక్షరమాలలో కొత్త శబ్దాలు తక్కువే ఉంటాయి. కొన్ని నిమిషాలు, కొన్ని గంటలు, లేకపోతే కొన్ని రోజుల అభ్యాసమువలన ఎటువంటి పాఠాన్నయినా విద్యార్థి తడుము కోకుండా వెంటనే చదువగలడు.

క్రైస్తవ మిషనరీలు, అభివృద్ధిలేని భాషలను వ్రాయుటకు ధ్వనిలిపినే ఎల్లపుడూ వాడతారు. మత గ్రంథమయిన బైబిలేకాదు వాచకాలు కూడ వాటితోనే చాలా భాషలలో ప్రచురించారు. ఈ ధ్వనిఅక్షరమాల టర్కీలో వారి సంప్రదాయ అక్షరమాలకు బదులుగా వాడుకలోనికి వచ్చింది. హీబ్రూ భాషకు గూడ దీనినే ఉపయోగించే ఆలోచన ఉన్నది. విదేశీయులు, చీని జపాను భాషలను ధ్వనిలిపిద్వారానే అభ్యసిస్తున్నారు. ధ్వనిలిపిని ఉపయోగించుటవలన భారతదేశంలో విభిన్న మాండలికాలను తొలగించలేకపోయినప్పటికీ విభిన్న లిపులను తొలగించవచ్చును. ప్రాథమిక వాచకాలను పాఠ్యపుస్తకాలను అంతర్జాతీయ ధ్వనిలిపిలో సోరపిల్లలకు నేర్పుట వలన కలుగు సదుపాయమును నేను, నా కుమారుడు జి.వి. సీతాపతి సోరాఏజెన్సీలోని పెరంగోలో 1930 నవంబరు 3వ తేదీ నాడు టి. ఆస్టిన్ ఐ.సి.ఎస్. దొరగారు నిర్వహించిన దర్బారు సమయమున ప్రదర్శన ద్వారా నిరూపించాము.

ఆ ధ్వని లిపిని ఉపయోగించే పద్ధతి విద్యార్థులకు ఈ మాన్యుయల్‌లో తగినచోట చెప్పబడింది. సోర భాషలోని ముఖ్య లక్షణాలు అవగతము కావించుటకు తగిన శ్రద్ధ చూపబడింది. అంతటా సోర భాష ఒకే విధముగా ఉండదని తెలుసుకోవాలి. ఈ భాష ముఠాకు ముఠాకు, గ్రామానికి గ్రామానికి మారుతుంది. ఒకే గ్రామములోకూడ ఉచ్చారణ

---

1. మానవజాతి శాస్త్రంపై వివరణలు, ప్రశ్నలు - పేజీ 362

భేదములు కనిపిస్తాయి. ఒక్కొకసారి వయస్సును బట్టి, ఆడ, మగ తేడాను బట్టి కూడ ఉచ్ఛారణమారుతుంది. ఒకే వ్యక్తి మాటల్లో కూడ అతని భావస్థితి ననుసరించి, వేగము, స్థాయి, తీవ్రతననుసరించి భేదాలుంటాయి.[1] ఒక్కనికైనా అక్షరంజ్ఞానంలేని సంఘములో ఇది తప్పనిసరి. అన్ని సజీవ భాషల వలెనే సోరభాష కూడ మాండలికాలలోనే జీవిస్తున్నది. సోర భాషను మాతృభాషగా మాట్లాడేవారికి భేదాలున్నప్పటికీ ఒకరినొకరు అర్థం చేసుకోగలరు. అయితే ఈభేదాలు మరీ హద్దుమీరి అర్థం కానివి కాకూడదు. నేను గుమ్మ ప్రాంతాన్ని చివరలో చూచాను. అయితే సవర భాషను నేర్చుకొను విద్యార్థులు ఈ గుమ్మమాండలికాన్నే మొదట అభ్యసించాలని నేను ఎంపిక చేశాను. ఈమాండలికాన్ని ప్రామాణికంగా తీసుకొనవచ్చును. దుర్గమ ప్రాంతాలలో కూడ ఇది ఒకే విధంగా, ఆచరణ యోగ్యంగా ఉంటుంది. ఇతర ముఠావాళ్ళకు కూడ ఇది అర్థమౌతుంది. సోరలందరూ దీని ఆధిక్యతను, స్వచ్ఛతను గుర్తించారు. ఒకటి మాత్రం మనం గుర్తుంచుకోవాలి. "మాట్లాడే భాష ఏదీ వాస్తవానికి ప్రామాణికం కాదు. ప్రామాణిక ఆంగ్ల భాషను మాట్లాడే ఏ ఇద్దరి ఉచ్ఛారణ కూడ ఒకేవిధంగా ఉండదు."[2]

సోరభాషాధ్వనులలోని భేదాలను కొన్నిటిని మొదటి విభాగం (పేజీ 9)లో చూపించాను. మిగిలినవాటిని చూపుటకు చొరవ చేయలేదు. కొత్త వారికి ఈ భేదాలను ఎక్కువగా చూపినట్లయిన వారు గాభరా పడే ప్రమాదముంది. సోర భాషను నేర్చు కొనే తెలివైన

విద్యార్థి సోరలతో మాట్లాడి అనుభవము గడించిన తరువాత ప్రామాణికమైన భాషకు పాఠ్య భేదములున్న భాషకుగల తేడాలను గ్రహించగలడు. వేరు వేరు ముఠాల వారితోను, తాలూకా కచ్చేరీలకు వచ్చిన వారితోను, రహదారి బంగళాలలో ఉద్యోగస్థులను కలుసుకున్న సమయంలో సోరలు వారితో మాట్లాడునపుడు ఆ భేదాలను గుర్తించగలరు. ఇటువంటి పాఠ్యభేదాలు ఒరియా, తెలుగు, ఇంగ్లీషు- వాస్తవానికి అన్ని సజీవ భాషలలోనూఉంటాయి.

సోర భాషలోని కొన్ని అసాధారణ లక్షణాలను గుర్తించడం అవసరం.

(1) అవరోధితహల్లులకు (ckecked consonants) (4వపేజీ),"అవరోధిత అచ్చులకు" (ckecked vowels) (కంఠమూలీయ అవరోధం;glottal ckeck, 5వపేజీ) సోరభాషలో తేడా

---

1. విదేశీ భాషలు, మాండలికాల లోని దురవగాహమైన ఊనికను వివరించడం కష్టం. స్పష్టమైన, మరీ అంత స్పష్టంగాని ధ్వనులను అలవాటుగా పలికేవారు కూడా గుర్తించలేనన్ని ఎక్కువ ధ్వనులు భాషలో ఉంటాయి. సపీర్, 'భాష' పేజీ 44

2. ఎన్సైక్లోపీడియా బ్రిటానికా.

ఉన్నది. అచ్చులను సోరలు ఎలా ఉచ్ఛరిస్తారో నేర్చుకొనే వరకూ వాటిని ముండారీ వ్యాకరణములో[1] హాఫ్‌మన్ చెప్పిన విధంగా నిలుపు (check) చేస్తుండాలి. (మాన్యువల్ 5వ పేజీ రెండవ పాదపీఠిక చూడండి) ఉ॥ (d' a:-n) డ' అ-న్ ='నీరు' అనేమాట (da'-a:-n) డ'-ఆన్ వింటాము. మొదటి 'అ' చాలా పొట్టిగా పలకాలి.

(2) షష్ఠీవిభక్తుల (Genetives) నిర్మాణములో సంబంధ బోధక సార్వనామిక అంత్య ప్రత్యయములు(Possessive pronominal suffixes) వస్తువులు కలిగినవున్నవారి పేరుల తరువాత రావాలి. ఉ॥యజ్-షెన్ 'తల్లి నా' కాని షెన్-అ-యజ్ 'నా యొక్క తల్లి' కాదు. అ-యుజ్-అన్-జి 'యొక్క తల్లి వారి' కాని ఆనిన్‌జి-అ-యజ్ 'వారి-యొక్క-తల్లి' కాదు(మేన్యుయల్‌లో పేజీలు 21-22 చూడండి)

3)ఉపవాక్యాల (క్లాజుల) లోను, సమాసాలలోను, క్రియలతో కలిపే పదాలు నిత్యం కుదించుకుపోతాయి. వీటిలో పూర్తిరూపాలు వాడరాదు. అట్టి పదాలు వందల కొలదీ ఉన్నాయి. ఉదా॥ సుడా-కిడ్-అన్ (పెద్ద పులి); కాని సుడా-కినాన్ కాదు, (మేన్యుయల్‌లో పేజీలు 41-45చూడండి)

4) ఇంగ్లీషులో కర్మణ్యార్థకంలో (Passive voice) ఉన్న వాటిని సోర భాషలోనికి అనువదించునపుడు భావార్థక రూపాలను వాడాలి (మేన్యుయల్‌లో పేజి 126 చూడండి)

(5) సోర భాషలోని వాక్య నిర్మాణ క్రమము, ఇంగ్లీషు, ఒరియా, తెలుగు భాషలలోని వాక్య నిర్మాణక్రమమూ ఒకటి కాదు (మేన్యుయల్‌లో పేజి 156 చూడండి)

---

1. ముండాభాషలో అవరోధిత అచ్చులు గలవనుట పొరపాటని రెవరెండ్ పీ. వి. బోడింగ్ గారు అభిప్రాయ పడ్డారు. (చూడు వారి సంతాలీ వ్యాకరణం పేజీ 71-నుండి) ఈ విషయముపై తన అభిప్రాయాలను దయతో వారు నాదృష్టికి తెచ్చారు. ఈ విషయముపై వివరంగా చర్చించుటకు సమయం కాదు. ఆచరణలో సవర విద్యార్థికి ఈ చర్చలు అంత ఉపయోగపడవు. నేను ఈ మాన్యుయల్ లో ( ' )గుర్తుద్వారా సూచించిన అవరోధిత అచ్చులకు, పదాంతంలో స్వరాన్ని కోల్పోయి దాదాపు వినబడని నాద హల్లులకు గల భేదాలను గుర్తించుట నేర్చుకొంటేచాలు. (పేజీ 4,14). ప్రొఫెసర్ స్టెన్ కొనో గారు హాడ్జన్ ను అనుసరిస్తూ కంఠమూలీయ అచ్చును (pausing tone) విరతిస్వరము, నాదాత్మక హల్లును (abrupt tone)ఆకస్మికస్వరము అని అన్నారు. (చూడు లింగ్విస్టిక్ సర్వే 3-1 పేజీ 340,382) ఈ కంఠమూలీయ అవరోధాన్ని స్వరముగా భావించడం తప్పు అని ఆతరువాత గ్రహించారు. ఈ కంఠమూలీయ అవరోధం తూర్పు, పశ్చిమ ప్రాంతాల చాలా భాషలలో కొన్ని పదాలకు మొదటిలోను మధ్యలోను, కొన్ని పదాలకు చివరలోను కనబడుతుందని అంటారు. ఈ ధ్వని సమస్యను నిపుణుల నిర్ణయానికి విడిచిపెట్టడం మంచిది. (లింగ్విస్టిక్ సర్వే -1 పేజీ 48)

(6) నిష్పన్న పదాల (derivatives) ఏర్పాటుకు, ఇతర ఉపయోగముల కొరకు మధ్య ప్రత్యయములను వాడడం సోర భాషకు, దాని సజాతి భాషలకు ప్రత్యేకమైనది. (మేన్యుయల్‌లో పేజీలు 45-47చూడండి)

(7) ఉపవాక్యాల (clause)నిర్మాణములో 'అ' ప్రారంభంలోను, '-అన్' అంత్యంలోను ఉండాలి. తెలుగులోను, ఒరియాలోను ఉన్నట్లుగా సోరభాషలో సంబంధ బోధక (relative) సర్వనామాలు లేవు. (మేన్యుయల్‌లో పేజీ49 చూడండి)

(8) నామప్రత్యయములకు (noun suffixes) -అన్ చేర్చడం లేదా విడిచి పెట్టడం, ఏకాక్షరిక (mono syllabic) క్రియలను పునరుక్తి (reduplication) చేయవలెన్న నిబంధనను నిత్యమూ పాటించాలి. వాటిని వాడకున్నా లేదా తప్పుగా వాడినా చెప్పేది అర్థంకాదు. లేదా తప్పుతోవ పడుతుంది. అపహాస్యమౌతుంది.

(9) సోరభాషలో గమనించిన వివిధ వ్యాకరణ ప్రక్రియలలోని స్వాభావిక విలువలను, ఇంగ్లీషు, తెలుగు ఒరియా భాషలలో వ్యక్తపరచలేము. సౌకర్యం కోసం కొన్ని సోర వ్యక్తరూపాలను, విద్యార్థికి తెలిసిన ఇంగ్లీషు వ్యాకరణ పరిభాషలో చూపితిని. భాషాభాగాల విభజన పద్ధతి ఈ రెండు భాషలకు ఒకటికాదు. విద్యార్థికి బాగా తెలియుటకు నేనిచ్చిన ఉదాహరణలన్నిటినీ సాధ్యమైనంత వరకూ ఉన్నది ఉన్నట్లుగా ఇంగ్లీషు లోనికి అనువదించితిని. సోరభాషపై నా అభిప్రాయమును తెలుపుటకుగాని, దాని సంబంధితభాషల మధ్యగల అనుబంధాన్ని వివరించుటకుగాని ఇది తగిన సమయము కాదు. వాటిని నా నిఘంటువుకు వ్రాయు పీఠికలో వివరిస్తాను.

విషయ సూచికను చూచిన వారు నేను అన్ని భాషాప్రక్రియలను, అన్ని భాషావిశేషాలను ఉదాహరణలతో వివరించినట్లు గ్రహించగలరు. అధిక సంఖ్యలో పదజాలాన్ని (సుమారు 2400 పదాలు) చేర్చాను. సోర ప్రపంచములోని అనేక జీవితార్థాలకు, ఆలోచనలకు, అనుభూతులకు సంబంధించి సోరలు ఉపయోగించే జాతీయపదబంధాలను చదువవలసిన పాఠాలలో చేర్చాను. ఇందులో అనేక విషయాల ప్రస్తావన ఉండుటచేత ఇవి ఎంతో కొంత సోరజాతి 'ఆత్మ' ను ప్రతిబింబించి బహిర్గతం చేస్తుందని నమ్ముతున్నాను.

సోరలుతో వ్యవహరించుట కొరకు వారి భాషను నేర్చుకొనే వారి ఉపయోగార్థమే ప్రధానంగా ఈ మాన్యువల్ రూపొందించాను. అయినప్పటికీ ఇది భాషాశాస్త్ర అధ్యయనమునకు కూడ ప్రయోజనకారి. ఇందుకొరకు వారికవసరమైన ముఖ్యసామగ్రి సోర

భాషయొక్క వాస్తవవిషయాలే అని గ్రహించాలి. అవన్నీ చాలవరకు ఇందులో ఇవ్వబడ్డాయి. నాశక్తి మేరకు వాటిని యధాతథంగా చెప్పుటకు తగిన శ్రద్ధ చూపించాను.[1] ఇందులోని ఉదాహరణలన్నిటినీ సోరల ముందు చదివి ధృవ పరచుకొన్న తరువాతనే ప్రూఫులను అచ్చుకు పంపించాను. నేను తెలుగు లిపిలో కూర్చిన సోర వాచకములు పాశ్చాత్యులకు ఉపయోగపడవని చెప్పిన సర్ జార్జి గ్రియర్ సన్ గారి అభిప్రాయమును చూచినప్పటినుండి, ఆ సూచన నామనసులో మెదులుతునే ఉన్నది.[2] మాస్టరు (గ్రియర్ సన్) గారి ఆదేశాలను పాటించి సోర భాషకు శాస్త్రీయ పద్ధతిలో అధ్యయనము చేయుటకు కావలసిన సామగ్రిని ఇంగ్లీషు లోప్రచురించమని పారిస్‌లోని ప్రొ॥ యూల్స్ బ్లాక్ గారు నన్ను ఆర్ధించారు. అలా చేసినట్లయిన ప్రపంచవ్యాప్తంగా పండితులకు ప్రయోజనకారి కాగలదని వారి అభిప్రాయము. ఎదురు చూచిన ఆ అవకాశము ఇప్పుడు నాకు లభించింది. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న భాషాశాస్త్ర పండితులకు ఉపయోగపడుటకు అనువుగా ఈ మాన్యువల్‌ను రూపోందించుటకు ప్రయత్నించితిని. అందుకని దీనిని తయారు చేయుటలో నాకు గల అసలు ఉద్దేశాన్ని మరచిపోలేదు. ఈ మాన్యుయల్ మొదటి మూడు ప్రకరణముల ప్రూఫులను ప్రొ॥ బ్లాక్ గారి అభిప్రాయము కొరకు పంపించాను. "మీరు చేస్తున్న కృషికి మిమ్ము అభినందిస్తున్నాను. ఈ మీకృషికి నాప్రోత్సాహముకూడ కారణమయితే అందుకు నాకు ఆనందంగాను, గర్వంగానుఉన్నది. మీ ప్రణాళిక ఎంతో ఆచరణయోగ్యమైనది. పోలికలతోను, ఊహలతోను ఇది భారం కాకూడదని భాషాశాస్త్రజ్ఞులు ఆశిస్తారు. అవి సరియైనవయినా సందేహాలకు, చర్చలకు అవకాశాన్నిస్తాయి. మీ వంటివారు చెప్పినవి నమ్మదగినవి, నిరూపించబడినవి అయిననూ వాటిని వాస్తవాలతో జత చేయరాదు.....కాలేజీ డి ఫ్రాన్సులోని చైనా భాషాచార్యులు, భాషా శాస్త్రవేత్త నా మిత్రుడు అయిన హెచ్. మాస్పెరోకి మీ ప్రూఫులను

చూపించాను. వారు ఖ్మెర్, సయామీ కుటుంబ భాషలలో సమర్థుడైన భాషాశాస్త్రవేత్త. వారు మధ్య ప్రత్యయముల గురించి మరిన్ని వివరాలు కావాలన్నారు." అంటూ వారు పై సమాధానము వ్రాశారు. వియన్నాలోని ప్రొ॥డబ్ల్యు ఎఫ్. డి. హెవిశే గారు బ్లాక్ దగ్గర నుండి ప్రూఫ్‌లను తీసుకొని చదివారు. వారు సోర మాన్యుయల్ తయారు చేసినందుకు

న న ం ు

---

1. మద్రాసు ప్రభుత్వానికి చెందిన అనేక మంది బ్రిటిషు ఐ.సి.యస్ అధికారులు నా కృషిని అభినందిస్తూ వ్రాశారు. జి.వో. నెం. 39, జుడీషియల్ (న్యాయశాఖ) తే 9 జనవరి, 1911దీ. 1916 న్యాయశాఖ తే 14 డిశంబరు, 1911దీ. ఏజెన్సీ పరిపాలన నివేదికలు (గంజాం 1926-27, 1927-28, 1928-29)

2. లింగ్విస్టిక్ సర్వే వాల్యూం 1, పేజీ 35.

అభినందిస్తూ లేఖ వ్రాశారు. ఇప్పుడు వారు ముండా భాషలపై చేయుప్రత్యేక వైజ్ఞ అధ్యయనములో మునిగియున్నారు. ఫిన్నో ఉగ్రియన్ భాషా కుటుంబానికి, ముండా భాషకు సంబంధం కలదని వారు నమ్ముతున్నారు.

మనదేశంలోని పండితులు కూడ నన్ను ప్రోత్సహిస్తూ లేఖలు రాశారు. వారికి నా కృతజ్ఞతలు. ఉత్తరాది చర్చిలయొక్క సంతాలి మిషన్‌లో బోధన కార్యకర్తగానున్న రెవ. పి. ఒ. బోడింగుగారు "భారతీయులు, తమ పాండిత్యాన్ని ప్రదర్శించిన ప్రతిసారీ నాకు ఎంతో ఆనందం కలుగుతుంది. మీరు అట్టి వారే. మీరు చేస్తున్న పని అట్టి పాండిత్య కృషి కలదే." అని వ్రాశారు. ఎర్నాకుళం మహారాజా కళాశాల ఆచార్యులు, నా మిత్రులు ఎల్. వి. రామస్వామి అయ్యరుగారు నాపుస్తకాన్ని ఒకసారి చూడగనే, పండితులను ఆకట్టుకునే ఆవశ్యక లక్షణాలు అందులో ఉన్నట్లు గ్రహించారు. "ఈ మాండలికానికి సంబంధించి నాకు బోధపడిన అతి ముఖ్య విషయమేమంటే ఇండో ఆర్యన్ భాషలతో ఒకప్రక్క, ద్రావిడ భాషలతో మరొక ప్రక్క సాన్నిహిత్యం నెరుపుకుంటూనే ఇది కొలారియన్ పద నిర్మాణముఖ్య లక్షణాలన్నిటినీ నిలుపుకున్నది. నాకు సోర భాషతో ఇంతకు ముందున్న పరిచయం పరిమితమైనది. అది "లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా" 4వ భాగం నుండి తెలుసుకున్నంత వరకే. అప్పటి నా అభిప్రాయమేమంటే సవరభాష ఒక సంకర మాండలీకమని. ఇండో ఆర్యన్, ద్రావిడభాషల పదనిర్మాణ లక్షణాలను అధికముగా కలిగియున్నదని. కాని, మీ మాన్యువల్ చదివిన తరువాత నా అభిప్రాయాన్ని సవరించుకున్నాను....మీ కృషిని ఎంతో మెచ్చుకుంటూ రెండు రోజుల క్రితం ప్రొ॥ బ్లాక్ గారినుండి నాకొక లేఖ వచ్చింది. భాషాశాస్త్ర విద్యార్థులందరూ మీ గ్రంథాన్ని మనస్ఫూర్తిగా ఆహ్వానిస్తారు." అని వారు నాకొక లేఖ వ్రాశారు. సి. హేండర్సన్ ఐ.సి.ఎస్ గారు "ఎలా అయితేనేం, చివరకు మీ మాన్యువల్ అచ్చయినందుకు నాకు ఆనందంగా ఉన్నది. ఒక విధంగా చెప్పాలంటే ఇది జీవిత పర్యంతక కృషి ఫలితము. అభిలాషతో ఈ భాషను అధ్యయనము చేయుటకు మీరుపడిన శ్రమను, చూపిన ఓర్పును నేను చాలాసార్లు మెచ్చుకున్నాను. మీ కృషి ఎంతో నిర్దుష్టమైనదని నేను పూచీ ఇస్తున్నాను" అంటూ అభినందించారు.

సహాయకులు లేరు. ధనము లేదు. మలేరియా జ్వరం, ఎదురైన నిరుత్సాహాలు మొదలగు కష్టాల వలన అనేక సార్లు విసుగు చెంది నాపనిని పక్కకు పెట్టాను. అయినా నాకుగా నేను చేపట్టిన ఈ పనిని చివరకు సాధించాను. ఇది అసంపూర్ణమైనదని నాకు తెలుసును. నావంటి ఒక్కని ప్రథమ ప్రయత్నము వలన సోరభాషకు రాచబాట ఏర్పడదు.

నేను దారిని శుభ్రపరచి కొన్ని కొండగుర్తులు పెట్టాను. అదేమంత గొప్ప విషయంకాక పోవచ్చును. అయితే నా శ్రద్ధంతా దానిలోనే విలీనమైపోయింది.

ఈ పుస్తకానికి పరిచయవాక్యాలు రాసిన ఎ. గెలెటి ఐ.సి.ఎస్ గారికి నా కృతజ్ఞతలను తెలియజేయుచున్నాను. నేను సంకలనం చేయు ఇంగ్లీషు-సోర, సోర-ఇంగ్లీషు నిఘంటువులను, సోర మాన్యుయల్‌ను ప్రభుత్వ ముద్రణాలయంలో ముద్రించాలని, వాటిని ధ్వనిలిపిలోనే ముద్రించాలని గవర్నరు ప్రతినిధిగా వారే మద్రాసు ప్రభుత్వానికి ప్రతిపాదించారు. వాటిని సంకలనము చేయుటకు కావలసిన వ్రాత సహాయమును కూడ నాకు అందజేయవలెనని కూడ ప్రభుత్వానికి ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదనను దయతో అంగీకరించిన ప్రభుత్వానికి కూడ నాకృతజ్ఞతలు. ఈ గ్రంథాలలో ఒరియాకు బదులు అంతర్జాతీయ ధ్వనిలిపిని వాడుటను అప్పటి విద్యాశాఖ డైరెక్టరుగా ఉన్న హెండర్సన్ గారు బలపరిచారు. వారికి, శ్రీ టి. ఆస్టిన్ ఐ.సి.ఎస్ గారికి కూడ కృతజ్ఞుడను. నామాన్యుయల్ లోని చదవవలసిన పాఠాలను కొండలలోని సోరలకు వినిపించి, అవి ఎంతవరకు సరియైనవో పరీక్షించడానికి తగిన అవకాశమును శ్రీ టి. ఆస్టిన్ గారు నాకు కల్పించారు. సెరంగోలోని వెల్ష్‌మన్ సోర శిక్షణ పాఠశాలలో ఇప్పుడు పని చేస్తున్న తర్రంగ్ అను కుర్రవాడు కొంత కాలము నాకు సహాయకునిగా ఉన్నాడు. సోర వాచకములను, తెలుగు-సోర నిఘంటువును సవరించు సమయములో సోరభాష వాడుకలోని అనేక విషయాలను నేను ఆకుర్రవాని వద్ద నేర్చుకున్నాను. ఈ మాన్యుయల్ లో సోర నుడికారములోలేని మాటలు లేవన్నచో అందుకు ఇతడు, మరొక కొండసోర రుడుగు చేసిన ఉచితమయిన విమర్శలే కారణం. నా పెద్దకుమారుడైన జి.వి. సీతాపతికి సోర భాష బాగా తెలుసు. ఇతడిప్పుడు, ఆంధ్ర విశ్వవిద్యాలయములో పరిశోధనా విద్యార్థిగా ఉంటూ సోరజాతి గురించిన మానవజాతి శాస్త్ర పరిశోధనలో నిమగ్నుడయి ఉన్నాడు. ఈ మాన్యుయల్ తయారు చేయుటలోను, దాని ప్రూఫులను దిద్దుటలోను ఇతడు నా కెంతో విలువైన సహాయమునందించాడు.

సోర విద్యార్థులు, నేను కూడ ప్రభుత్వ ముద్రణాలయ సూపరింటెండెంట్ గారికి ఎంతో కృతజ్ఞులము. నాగరిక ప్రపంచానికి తెలియని ఒక విచిత్రమయిన భాషలో ధ్వనిలిపిలో వ్రాసిన గ్రంథమిది. అందుకు కొత్త టైపు అక్షరాలు అవసరం. అక్షరాల మధ్యలో చిన్న గీతలుంటాయి. అక్షరాలు పలుకుటకు అవసరమయిన ఒత్తిడి, పొడవు, మొ॥ వాటిని తెలియజేయు కొత్తకొత్త చిహ్నాలుంటాయి. ఈ ఇబ్బందులన్నీ అధిగమించి, ఆఖరుక్షణంలో సూచించిన మార్పులు, చేర్పులును కూడ మెచ్చుకోదగిన ఓర్పుతోను, దయతోను అమలు

పరిచి ఈ గ్రంథాన్ని స్పష్టంగాను, శుభ్రంగాను, తప్పులులేకుండా వారు అచ్చువేశారు. అదివారు తీసుకున్న శ్రద్ధకు నిదర్శనం.

నా కృషిని ఎంతగానో ప్రశంసించిన నామిత్రురాలు మిస్. ఎ. సి. మన్రో (సి. బి. మిషన్) గారికి నేను ఎంతో రుణపడి ఉన్నాను. సోరభాషలో మాట్లాడుటకు ఆభాషలో మత బోధచేయుటకు కొంతకాలము వారు నావద్ద సోరభాషను అభ్యసించారు. నాసోర భాషా జ్ఞానాన్ని మరింత మెరుగుపరచుకొనుటకు అది నాకు తగిన ప్రోత్సాహమునిచ్చింది. నాభాషాజ్ఞానాన్ని అందరికీ అందుబాటులోనికి తెచ్చి, ఆమెవలె ఇతరులుకూడ సోరలకు మేలుజరిగే విధంగా ఈ భాషాజ్ఞానాన్ని ఉపయోగిస్తారని నాఆశ. సోర విద్యార్థికి ఎదురయ్యే అడ్డంకులేమిటో మిస్. మన్రోకు స్వానుభవము. కొత్తగా నేర్చుకుంటున్న సోర విద్యార్థికి ఈ అడ్డంకులు దాటడం కష్టం. తమ భాషతప్ప వేరేభాష రాని సోరల నుండి సోరభాష వాస్తవాలను రాబట్టుటకు, వాటిని సంగ్రహించి, జల్లెడపట్టి అందరికీ బాగా తెలిసే విధంగా ఒక తెలివైన పద్ధతిని ఏర్పాటు చేయుటకు నేను పడిన శ్రమ ఇతరులకంటె ఆమెకు బాగా తెలుసును. నేను సోరభాషయొక్క అర్థకాలు (Particles), రూపపదాలు (Form words), పూర్వప్రత్యయాలు, మధ్యప్రత్యయాలు అంత్యప్రత్యయాలు, ఆ భాషయొక్క అనేక ఇతర విషయాలు అర్థాలు, వీటిని ఆమె సేవలోనున్న సోరల సహాయముతో తెలుసుకొనుటకు ఎంతో తెగింపుతో చేస్తున్న ఈ నా ప్రయత్నాలను తరచుగా దగ్గరుండి చూచింది . అందుచేత ఆమె పూర్తిగా చిత్త శుద్ధితో తన ప్రశంసలను వ్యక్తము చేయుటయే గాక, నేను చేసిన కృషి యొక్క విలువను అంచనా వేసి దానిని ఈ విధమైన ప్రశంసా వాక్యాలతో వివరించింది. "పది సంవత్సరాల క్రితం నేను సవరలతో కలసి పని చేయుటకు ఇచ్చుటకు వచ్చినపుడు మేము ఒకరినొకరు అర్థం చేసుకోలేకపోయాం. అప్పుడు సవర ద్వారం పూర్తిగా మూసి ఉన్నది. ఆ ద్వారం లోపలనుండి, బయటినుండి కూడ బంధించబడింది. ఈనాడు ఆ ద్వారం మడతబందుల సహాయంతో వెనుకకు ముందుకు తేలికగా తెరచుకొంటున్నది. నిపుణుడైన పనిమంతుడు రావ్‌సాహెబ్ జి.వి.. రామమూర్తి దానికొక తాళంచెవి అమర్చాడు- అదే సోర మాన్యుయల్ .

"కేవలం ఒక దశాబ్దం క్రితం ఎవరికీ తెలియని వారిభాష మూలమున సవర ప్రజల కాళ్ళు కట్టివేయ బడినాయి. నోరునొక్కివేయబడింది. ఇప్పుడు వారికి జీవము వచ్చింది. వారు కదలగలరు. వారికొక ఆకారము ఏర్పడింది. వారిప్పుడొక నూతన వ్యక్తిత్వము గలవారై మానవజాతిని అభివృద్ధి మార్గములో నడిపించుటకు చెప్పుకోతగిన సహాయము చేయగలరు."

"ఇప్పుడు సవరలు, తమ మనసులోని మాటను బయటకు చెప్పలేని మూగవారు కాదు. వారు మాట్లాడతారు. మనము వింటాము. మనము ప్రశ్నిస్తాము. వారు సమాధానమిస్తారు. మనము బోధచేస్తాము. వారు గ్రహిస్తారు. అధికారులు, మిషనరీలు, ఉపాధ్యాయులు, సవరలు వీరందరికీ సవర ప్రపంచ ద్వారమును తెరిచే తాళముచెవి లభించినది. గురువుగారికి చాలినంతగా నా కృతజ్ఞతలను చెప్పుకోలేను. నాస్వంత రుణాన్ని నేను ఏ విధంగా తీర్చుకొనదలచానంటే అలవాటు లేని వారితో తాళం తీయించుటకు సహాయ పడతాను."

సి. బి. మిషన్, సెరంగో,
వయా, పర్లాకిమిడి,
ఏప్రెల్, 30, 1931 అనీ సి. మెక్. ఎ. మన్రో

దైవదత్తమయిన ఈ ప్రపంచంలో అందరికంటె మన్రో గారికే ఈ గ్రంథంపై ఆసక్తి అధికం అని నాకు తెలుసును. నేను అందించిన ఈ కొద్దిపాటి సేవలకు నన్ను అందరూ ప్రశంసించవలెనని కోరను. అయినా నాసేవలకు తగిన ప్రతిఫలం లభించింది. అందుకు నాకు ఆనందముగా ఉన్నది. తన సవర భాషాజ్ఞానాన్ని తనతో పని చేయువారికి అందజేయగలనని ఆమె ఇచ్చిన వాగ్దానమే ఆ ప్రతిఫలం. నేను ఆనందించుటకు తగిన కారణమున్నది. ఆమె నా కృషిని ఇంకా అభివృద్ధికి తెస్తుంది. ఆమె తన విద్యార్థులకు నేను రచించిన ఈ చిత్తు, ముసాయిదాను మించిన మార్గదర్శికాగలదు. అందుకే ఆమెకు ఈ గ్రంథాన్ని అంకితం చేస్తున్నాను.

పర్లాకిమిడి (దక్షిణభారతం) జి. వి. రామమూర్తి
విజయదశమి 20వ తేదీ అక్టోబరు 1931

-----000-----

# ప్రవేశిక

--------------

( ఎ. ఎమ్. ఎ. సి. గెలెటి గారు ఐ. సి. ఎస్ )

భారతదేశ తూర్పుతీర ప్రాంతం మధ్యగా ఒక పర్వత రాష్ట్రమున్నది. అది 5000 చ॥మై॥ విస్తీర్ణము కలది. ఖోండులు, సవరలు అనే రెండు ఆదివాసి జాతులకు అది నివాస ప్రాంతము. ఖోండిస్తాన్ ఉత్తరభాగాన అంతా ఖోండులు, మధ్యభాగాన ఖోండులు, సవరలు సంకీర్ణముగాను, దక్షిణభాగమంతా సవరలు ఉంటారు. ఈ పర్వత పీఠభూమి 5000 అ॥ఎత్తు వరకు ఇరుకైన, వంకరులు తిరిగిన లోయలతో ఉంటుంది. 2000 అ॥ ఎత్తుగల కొండల గోడ మధ్య మధ్యలో తూర్పునకు చీలి ఉంటుంది. దీనికీ బంగాళాఖాతానికి మధ్య 20 మైళ్ళ నుండి 80 మైళ్ళ వెడల్పుగల సారవంతమైన గంజాం మైదానాలున్నాయి. ఆ కొండ గోడ క్రింద దక్షిణాన పర్లాకిమిడి అనే పట్టణమున్నది. అది ఈ మాన్యువల్ రచయిత అయిన జి.వి. రామమూర్తి నివసించిన చోటు.

ఆఖరు దండయాత్రకు ముందు జరిగిన వరుస దండయాత్ర లేవీ ఈ ఖోండిస్థాన్‌ను తాకలేక పోయాయి. ఈ ఖోండులు, సవరలు వేరు వేరు జాతులవారు. అయినా వీరు అటు ఆర్యులు కానీ, ఇటు ద్రావిడులు కానీ కారు. వారి కంటె వీరు ప్రాచీనులు. గత మూడువేల సంవత్సరాలలో జరిగిన దురాక్రమణలేవీ వీరిపై ప్రభావం చూపలేదు.ఈ దురాక్రమణలను జరిపిన వారందరూ పులులకు, ఖోండిస్థానులోని మలేరియాకు భయపడి ఈ కొండల అంచునే నిలిచిపోయారు. చివరకు ఆంగ్లేయులు ఈ కొండప్రాంతాన్ని తమ ఆధిపత్యంలోనికి తెచ్చుకున్నారు. 19వ శతాబ్దం మధ్యలో పౌర పరిపాలన ఏర్పడక పూర్వము వైస్రాయ్ క్రింద నేరుగానున్న మిలిటరీ ప్రభుత్వ ఆధీనములో ఈ ప్రాంతము ఉండేది. ఈ ఖోండు తెగలలో గల నరబలి, శిశుహత్య, భ్రాతృహత్య వంటి ఆచారాలను, ధృడమైన సైనిక పరిపాలనద్వారా అంతమొందించి పౌరపరిపాలనను ప్రవేశపెట్టదలచారు. ఇందుకు 25 సంవత్సరాల కాలం పట్టింది. గత 50 సంవత్సరముల నుండి ఒక తరహా పౌర పరిపాలన జరుగుచున్నది. మద్రాసు గవర్నరు ప్రతినిధి పేరుతో (గవర్నమెంటు ప్రతినిధి కాదు) గంజాం కలెక్టరు గారి చేత కొన్ని నిరంకుశ అధికారాల తోడ్పాటుతో పరిపాలించ బడుచున్నది. ఈ ప్రతినిధికి చట్టాలుగాని, శాఖా పరమైన నిబంధనలుగాని వర్తించవు. అతడే ప్రధాన న్యాయమూర్తి, ప్రధాన ఇంజనీరు, ప్రధాన అటవీ శాఖాధికారి, రెవెన్యూ బోర్డు మరియు విద్యా శాఖ డైరెక్టరు. చివరి పదవియైన విద్యాశాఖ డైరెక్టరుగా నేను రావ్ సాహెబ్ రామమూర్తి పంతులుగారి సేవలను వినియోగించుకున్నాను. 25 సంవత్సరాలుగా వారు సవరభాషపై

చేస్తున్న కృషితో నాకు పరిచయమున్నది. అతని మొదటి తాత్కాలిక సవరభాషా పదజాలాన్ని నేను రాజధానిలో క్రింది కార్యదర్శిగా నున్నపుడు మద్రాసు ప్రభుత్వానికి పంపాను. నేను గంజాం గవర్నరు ప్రతినిధి అయిన తరువాత నా ఉపాధ్యాయుల ఉపయోగము కొరకు ఒక మాన్యుయల్, ఒక సమగ్ర నిఘంటువు అవసరమనుకొన్నాను. ఈ ఖోండులకు, సవరలకు ఖోండు భాషగాని, సవరభాషగాని మైదానం నుండి వచ్చిన ఒరియా ఉపాధ్యాయులే నేర్పాలి. "సవరపిల్లలు తమ ప్రాథమిక విద్య ప్రారంభించక ముందే ఒక కొత్త భాషను నేర్చుకొవాలి." వారి మాతృభాషను వారికి నేర్పరు. సవరలు తెలివైనవారు. వారి పిల్లల కొరకు మరిన్ని పాఠశాలలు ఏర్పాటు చెయ్యాలని వారు ఆత్రుతపడుతున్నారు. ఒరియాలోనే బోధించే ఈ పాఠశాలలకు ఒరియా పిల్లలు, ఒరియాను రెండవ భాషగా స్వీకరించిన సవరపిల్లలు మాత్రమే హాజరవుతున్నారు. ఉపాధ్యాయశిక్షణ పొందుతున్న వారందరూ ఒరియావారే. సవరభాష అందులో బోధనాంశము కాదు. రామమూర్తి సహాయంతో ఉపాధ్యాయులు సవరభాషను నేర్చుకొనే ప్రయత్నం చెయ్యాలని వాంఛించాను. ఉపాధ్యాయశిక్షణ పాఠశాలను పర్లాకిమిడి నుండి, అచ్చటికి 2500అ॥ ఎత్తున ఉన్న సవర దేశములోని సెరంగోకు మార్చుమని చెప్పాను. ఆ శిక్షణసంస్థకు అనుబంధంగా ఒక మాదిరిసవరపాఠశాల కావాలి అన్నాను. అందులో సవర విద్యార్థులే అధికులుగా ఉండాలన్నాను. కొద్ది నెలలలోనే రాతి గోడలతో కట్టిన ఆరు పురిపాలలు నిర్మించి సెరంగోలో ఒక ట్రయినింగు స్కూలు ఏర్పాటు చేశాను. దాని ప్రారంభోత్సవాన్ని ఆ స్కూలు హెడ్మాస్టరు సవరభాషలో నిర్వహించారు. ఆ భాషలో మాట్లాడుటకు అతడు తగినంత కృషిని చేశారు.

సవర భాషను పాఠశాలలలో బోధన భాషగా వాడుకలోనికి తేవలెనంటే దానిని వ్రాతలో చూపగలగాలి. వ్యాకరణము, నిఘంటువు సంకలనం చెయ్యాలి. రామమూర్తి మొదటి సవర వాచకము తెలుగులో ఉన్నది. ఈ భాషకు తెలుగు అక్షరాలు కాని, ఒరియా అక్షరాలు కాని సరిపోవు. అక్షరలిపికి బదులు మరే పాతలిపిని కూడ అమలు చేయలేము. సవర ధ్వనులను రోమను లిపికంటె తెలుగు లిపిలో లేదా ఒరియా లిపిలో చక్కగా పలికించలేము. సవర పిల్లల నెత్తిపై ఒకటికి మించిన లిపుల భారాన్ని మోపలేము. మాధ్యమిక స్థాయిలో వారుఇంగ్లీషు నేర్చుకొనక తప్పదు. దానికి రోమను లిపి కావాలి. ఎంతో కొంత మార్చకపోతే ఈ రోమను లిపి కూడ సవర ధ్వనులన్నిటినీ పలికించజాలదు. అందుచేతనే సవరభాషకు అంతర్జాతీయ ధ్వని లిపిని వాడాలనే రామమూర్తిపంతులు గారి ప్రతిపాదనను ఆమోదించాను. సవరలు నిజంగా అదృష్టవంతులు. శాస్త్రీయమైన ధ్వనిలిపిని తొలి నుంచీ వాడుకునే అవకాశము కలిగిన ప్రపంచంలోని మొదటి జాతి

సవరజాతే.

తన జీవితంలో సగభాగాన్ని శాస్త్రీయదృక్పథంతో సవర భాష అధ్యయనానికి వినియోగించిన రామమూర్తిగారి కృషికి ఈ మాన్యువల్ కలికితురాయి. దీని ప్రచురణ కొరకు ముండాభాషా కుటుంబముపై ఉత్సాహముగల భాషా శాస్త్రజ్ఞులు ఎంతగానో ఎదురుచూస్తున్నారు. భాషా శాస్త్ర ప్రపంచమంతా స్వాగతించే ఈ గ్రంథ ప్రచురణకు ప్రభుత్వము సాయపడాలనే నా ఆచరణయోగ్య లక్ష్యము నెరవేరింది. జి. వి. రామమూర్తి పంతులుగారి ముప్పది సంవత్సరాల అవిరళ పరిశోధనా కృషి ఫలితాన్ని ప్రపంచానికి అందించుటకు మద్రాసు ప్రభుత్వము గౌరవ ప్రదమైన పాత్రను నిర్వహించింది. ఈ గ్రంథ ప్రచురణకు అవసరమైన రాత సహాయమునకు ప్రభుత్వము ధనాన్ని అందజేయుటయే కాకుండ ఈ గ్రంథాన్ని తమ ముద్రణాలయములో ముద్రించింది.

మానవజాతి శాస్త్రము, భాషా శాస్త్రములను అధ్యయనము చేయగోరు వారి కొరకు హెర్ ప్రొ॥ ఫ్రెహెర్ వాన్ ఐక్ స్టెట్ (Herr Professor von-Eichstedt) 1927వ సంవత్సరములో సవర దేశములో బసచేసి ఎంతో శాస్త్రీయ సమాచారాన్ని సేకరించడం నాకు తెలుసును. మానవజాతి శాస్త్రరీత్యాగాని, భాషా శాస్త్రరీత్యాగాని సవరలు ఆసక్తి కరమైన జాతి. వారి నాగరికత తక్కువ స్థాయికి చెందినది కాదు. నూతన భారత దేశ భాగస్వాములలో ఒకటిగా సవరజాతికి మంచి భవిష్యత్తు ఉన్నది. దానికి రామమూర్తి గారి కృషే పునాది.

ఎ. గెలెటి
గంజాంలో ఒకప్పటి గవర్నరు ప్రతినిధి.

-----000-----

## పరిచయ వాక్యాలు

### టి. ఆస్టిన్ దొరగారు ఐ.సి.ఎస్.

-------------

రావు సాహెబ్ జి. వి. రామమూర్తి తన సోర (సవర) మాన్యుయల్‌కు కొన్ని పరిచయ వాక్యాలు రాయమని నన్ను కోరారు. నేను 1924 నుండి 1931 వరకు గంజాం కలెక్టరుగా ఉన్నప్పుడు రావుసాహెబ్‌ను తరచు కలుసుకొని ఆనందించేవాడిని. ముండాభాషపై వారు చేపట్టిన తులనాత్మక పరిశీలకై పడిన శ్రమకు, సాధించిన సమగ్రతకు, వారు అందించిన సామగ్రి యొక్క విశ్వసనీయతకు నేను సాక్షిని. అధికార పత్రాల ప్రకారము ఈ ఆదివాసీల భాషా, ఆచార వ్యవహారములు ఇతరులెవరికీ తెలియవు. అట్టి ఈ ఆదివాసీల భాషను రావు సాహెబ్, అతని కుమారుడు జి.వి. సీతాపతి క్షుణ్ణంగా నేర్చుకున్నారు. ఒక్క విషయం చెప్పెదను. అధికార పత్రాలలో ఈ ఆదిమవాసుల భాష ఒక అరడజను విధాలుగా రాయబడినది. అందరూ అనే విధంగా ఈ భాషను సవర అనకూడదు. సోర అనాలి. (ఈ సోర మాటలోని 'ఓ, అ' లను ఫ్రెంచి 'రోజ్' అనే మాటలోని 'ఓ' గాను ఇంగ్లీషు 'అహ్' గాను పలకాలి.) నేను పెరంగోలో నిర్వహించిన దర్బారులో ఈ ఆదివాసీలనుద్దేశించి రావు సాహెబ్ వారి భాషలోనే ప్రసంగించారు. ఆభాషలో పరీక్షలను నిర్వహించడానికి నేనెల్లప్పుడూ వారి సహాయమునే అర్థించుతుండేవాడిని.

కలెక్టరు ఆఫీసు, ఉదకమండలం
16 వ నవంబరు, 1931.

టి. ఆస్టిన్
ఇండియన్ సివిల్ సర్వీస్

*In recognition of the author's labours in the interests of the Savaras—*

*a Certificate of Merit was presented to him in the name of His Most Gracious Majesty, King George V, Emperor of India, on the occasion of His Majesty's Coronation Durbar at Delhi (12th November 1911);*

*the title of Rao Sahib was conferred on him as a personal distinction (1st January 1913);*

*the Kaisar-i-Hind Gold Medal for public service in India, of the First-class was awarded to him by His Most Gracious Majesty on 1st January 1933; and*

*the King's Silver Jubilee Medal was presented to him by command of His Majesty on the 6th May 1935.*

# SORA–ENGLISH DICTIONARY

COMPILED BY

RAO SAHIB G. V. RAMAMURTI, B.A.

(RECIPIENT OF THE KAISAR-I-HIND GOLD MEDAL)

*Retired Teacher, Parlakimedi,*

*Southern India*



---

*Published under the authority of the Government of Madras*

---

MADRAS

PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS

1938

# గ్రంథకర్త ముందుమాట

ఇంగ్లీషు-సోర, సోర-ఇంగ్లీషు నిఘంటువులను ప్రచురించుటకు 1927 వ సంవత్సరంలో మద్రాసు ప్రభుత్వం తన ఆమోదాన్ని తెలియజేసింది. సోరభాషకు లిపి లేనందువలన, సోరభాషాధ్వనులకు నేను ప్రతిపాదించిన విధముగా అంతర్జాతీయ ధ్వని సంకేతాలను ఉపయోగించుటకు కూడ మద్రాసు ప్రభుత్వము తన అంగీకారాన్ని తెలియజేసింది. అయితే ఒరియావాడైన ఏజన్సీ విద్యాధికారి నా ప్రతిపాదనను వ్యతిరేకించి సోరభాషకు ఒరియా అక్షరాలను వాడవలసినదిగా వేరొక ప్రతిపాదన చేశారు. విద్యాశాఖ డైరెక్టరు ఈ విషయాన్ని గంజాం జిల్లా గవర్నరు ప్రతినిధికి నివేదించారు. గవర్నరు ప్రతినిధి నన్ను కలుసుకొని ధ్వని సంకేతాలను ఉపయోగించవలెనన్న నా ప్రతిపాదనకు గల కారణాలు వివరించమన్నారు. ఈ వివాదం వలన ఎంతో సమయం వృధా అయింది. కొన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగిన తరువాత, గవర్నరు ప్రతినిధి అయిన సి. హేండర్ సన్ ఏజన్సీ విద్యాశాఖాధికారి ప్రతిపాదనను త్రోసిపుచ్చాడు. అప్పుడు హేండర్సన్ అభిప్రాయంతో ఏకీభవించిన విద్యాశాఖ డైరెక్టరు నేను తయారు చేయదలచిన ఇంగ్లీషు-సోర, సోర- ఇంగ్లీషు నిఘంటువులలో అంతర్జాతీయ ధ్వని సంకేతాలను వాడుటకు అనుమతించి తన నిర్ణయాన్ని ఎట్టకేలకుతెలియజేశాడు. సవరభాషకు ధ్వని సంకేతాలను వాడుట ఎందుకు ప్రయోజనకరమో తెలియజేసే నావాదనలను క్లుప్తంగా నా సవరభాష మాన్యుయల్‌లో వివరించాను. (గ్రంథకర్త ముందుమాట, 9-12 పేజీలు) టర్కీ, రష్యా, జపాన్, చైనా నాయకులు లాటిన్ అక్షరాలను ఉపయోగించుట వలన కలిగే ప్రయోజనాలను ఎప్పుడో గుర్తించారు. అరబ్బీ ప్రజల సాంస్కృతిక నిద్రమత్తును కొనసాగించే క్లిష్టమైన అరబ్బీ అక్షరాలకు బదులు లాటిన్ అక్షరాలు వాడుక లోనికి వచ్చాయి. ఆధునిక కెమాల్-టర్కీ కంటె ముందుగానే రష్యాలోని మహమ్మదీయదేశం అజర్‌బైజాన్ అరబ్బీ అక్షరాలకు ఉద్వాసన పలికింది.

సోర విద్యార్థులు సోరభాషను అంతర్జాతీయ ధ్వని సంకేతాలతో వ్రాయుట వలన కలుగు సౌలభ్యాన్ని ఒరియా విద్యాధికారులకు నచ్చజెప్పుటకు నేను, నాకుమారుడు సీతాపతి సోర దేశం మధ్యలో నున్న సెరంగో గ్రామములోని ప్రభుత్వ సోర పాఠశాలలో ఒక ప్రయోగం జరిపాము. గవర్నరు ప్రతినిధి, అతని సహాయకుడు ఆ పాఠశాల ఉపాధ్యాయుల సమక్షంలో 1930 నవంబరు మూడవ తేదిని ఆదివాసి నాయకుల దర్బారు జరిగినప్పుడు ఆ ప్రయోగాన్ని

నిర్వహించాము. దీనికి సంబంధించిన నివేదిక మద్రాసు ప్రభుత్వానికి పంపబడింది (గంజాం జిల్లా పరిపాలనా నివేదిక 1930-31)[1]

---

1. సెరంగోలో 'భేటీ' జరిగినపుడు మ॥ రా॥ శ్రీ రావు సాహెబ్ జి.వి. రామమూర్తి పంతులుగారు ఆ సభలో మాట్లాడుతూ సవరలకు ఒరియా భాషలో చదువు చెప్పడం కుదరదని, సకాలములో వారిని ఆ భాషలో సంపూర్ణులను చేయడం అసాధ్యమని చెప్పారు. సవర భాషనంతటినీ ఆంగ్ల వర్ణమాలలోని 20 అక్షరములకు కుదించి ధ్వని లిపిలో సవరలకు వారి భాషలోనే చదువు నేర్పడానికి ఒక ప్రతిపాదన చేశారు. ఆభేటీ లోనే ఆస్టిన్ ఎదుట, తాము చదువుచెప్పే పద్ధతి సులభమనీ, కొద్ది నెలల శిక్షణ తరువాత ఏ సవర వ్యక్తి అయినా, తన భాషలోనే, తన అభిప్రాయాలను ధ్వని లిపి ద్వారా వ్యక్తము చేయగలడని ప్రదర్శన ద్వారా నిరూపించారు. బొంతిల్లలోని ప్రభుత్వ ప్రాధమిక పాఠశాలలో సహాయ ఉపాధ్యాయుడైన నారాయణ గొమంగోని రావు సాహెబ్ వద్ద ధ్వని లిపిని అభ్యసించడానికి ప్రతినిధిగా పంపారు. వారి వద్ద ఒక నెల రోజులు అభ్యసించిన తరువాత ఆ పాఠ్య క్రమం (కోర్సు) పూర్తి చేయడానికి వారివద్దకు మరల మరొక నెల రోజుల పాటు పంపుటకు ఏర్పాటు జరిగింది.

సవరలకు ధ్వనిలిపిలోనే చదువు చెప్పి రెండు నెలలలోనే వారు, వారిభావాలను వారిభాషలోనే చెప్పగల సామర్థ్యము కలుగుజేయ వచ్చని రావు సాహెబ్‌గారు నాకు హామీ ఇచ్చారు. వచ్చే వర్షాకాలంలో కొంతమంది తెలివైన సవరలను ఈ ప్రత్యేక శిక్షణ కొరకు రావు సాహెబ్ వద్దకు పంపి ఈ ప్రణాళిను పూర్తిగా స్వచ్ఛమైన లంబా-లంజా సవర పాఠశాలలో ప్రయోగ పూర్వకముగా ప్రవేశ పెట్టదలచాము. (ఆ నివేదికలోని 7వ పేరా)

పర్లాకిమిడిలో సవర పాఠశాలను ప్రారంభించుటకు మ॥ రా॥ శ్రీ రావు సాహెబ్ రామమూర్తి పంతులు గారే కారకులు. వారు స్వతహాగా సవరలపై మొదటినుండి అభిమానము కలిగి యున్నారు. వారి కుమారుడు జి.వి. సీతాపతి రిసెర్చి ఫెలోషిప్పుతో ఇప్పుడు సవరలపై అధ్యయనము చేయుచున్నాడు. సవరల గురించి వారు అందజేయు సమాచారమునకు, సలహాకు నేను వారికి రుణపడి యున్నాను. వారి సలహా ననుసరించే బొంగ్‌తిల్ల ప్రాధమిక పాఠశాలలో ధ్వని లిపి ద్వారా సవరభాషను నేర్పే పద్ధతిని ప్రయోగ పూర్వకముగా ప్రవేశపెట్టదలచాను. సవరలు ఎలాగైనా తరువాత ఒరియా భాషను నేర్చుకొవాలి. మాదిరి పాఠశాలలో కొద్ది మంది సవర బాలురతో చేసిన ప్రయోగము ఎంత సులువుగా వారు ఆ లిపిని నేర్చు కొనగలరో రుజువు చేసింది. (అనుబంధం. పే-1. సవర ఏజెన్సీ టూర్ నోట్స్- టి.ఆస్టిన్ గారు, ఐ.సి.ఎస్ -పేరా గ్రూపు. 20.)

పై కారణముల వలన నిలిపి వేసిన ఈ నిఘంటువుల నిర్మాణ కార్యక్రమమును తిరిగి ప్రారంభించుటకు ముందు సోర మాన్యుయల్‌ను తయారు చేయమని వారి విద్యా శాఖాధికారి ప్రతిపాదననుసరించి మద్రాసు ప్రభుత్వం నన్ను కోరింది. ఈ పనిని వెంటనే చేపట్టమని నాకు సలహాకూడ ఇచ్చింది. అందుకు కావలసిన సామగ్రిని సంపాదించి ఒక సంవత్సరం వ్యవధిలో ఆమాన్యుయల్ పని పూర్తిచేశాను. మద్రాసు ప్రభుత్వ ముద్రణాశాల సూపరింటెండెంట్ గారిచే ప్రభుత్వ పక్షమున 1931 వ సం॥ లో మాన్యుయల్ ముద్రింపబడింది. ఇంగీషు-సోర నిఘంటువును తయారు చేయుటకు నాకు మరి రెండు సంవత్సరముల కాలము పట్టింది. అది 1933 వ సం॥ లో ముద్రింపబడింది.

కొన్ని అనివార్య కారణాలవలన సోర-ఇంగ్లీషు నిఘంటువును సంకలనం చేయుటలో కొంత ఆలస్యము జరిగింది. అప్పుడు మాకు కలిగిన వ్యక్తిగతమైన పరిస్థితుల మూలమున నేను, నాకు సహాయము చేయుచున్న నాకుమారుడు ఈపనికి కావలసిన సమయము, శ్రద్ధను అందించలేక పోవుటయే ఈ జాప్యానికి కారణం.[1]

---

1. కొత్త ఒరిస్సా రాష్ట్రాన్ని ఏర్పాటు చెయ్యాలనే ప్రతిపాదనతో పాటు గంజాం జిల్లాలోని అధిక భాగాన్ని ఒరిస్సా రాష్ట్రంలో కలిపే ప్రతిపాదన కూడ పరిశీలనకు వచ్చింది. ఆ ప్రాంతములోనున్న ఒరియా వారిని, తెలుగు వారిని వారి అభిప్రాయములు తెలియజేయమని ఒరిస్సా సరిహద్దు కమిటీ కోరింది. అందులో నేను చురుకుగా పాల్గొని పర్లాకిమిడి తాలూకా ఒరిస్సా రాష్ట్రంలో కలపాలన్న పర్లాకిమిడి రాజా ప్రతిపాదనకు నా నిరసన తెలియజేశాను. ఆ కమిటీకి సమర్పించుటకు నేనొక విజ్ఞాపన పత్రాన్ని తయారు చేసి దానిని నా కుమారుని చేత కాపీ చేయించాను. నాకుమారుడు 20 సంవత్సరాలుగా రాజా వారి కాలేజీలో చరిత్ర అధ్యాపకునిగా ఉన్నాడు. ఆ విజ్ఞాపన పత్రంలో రాజా వారి ప్రస్తావన ఉన్నదని, ఆ పత్రాన్ని నాకుమారుడు రాయకుండ ఉండవలసినదని చెప్పి నాకుమారుణ్ణి ఉద్యోగమునుండి తొలగించారు. ఉద్యోగము నుండి తొలగించిన తరువాత నాకుమారుడు పర్లాకిమిడిని ఒరిస్సా రాష్ట్రంలో కలుపుటకు వ్యతిరేకించిన ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నాడు. పర్లాకిమిడి తెలుగు ప్రజలచే తమ వాదనను మద్రాసు ప్రభుత్వానికి, భారత ప్రభుత్వానికి ఆ తరువాత లండనులోని సెక్రెటరీ ఆఫ్ స్టేట్ కు నివేదించుటకు 1933లో నియోగింపబడ్డాడు. దాని పర్యవసానము అటు తెలుగువారికి గాని, ఇటు రాజావారికి కాని అనుకూలము కాలేదు. నా అభిప్రాయము ప్రకారము ఇది సవరల అభివృద్ధికి హానికరము. ఈ విషయంలో ఒరియా నాయకులతో తలపడుట వలన ఎంతో కాలము వృధాఅయింది. (కారణము లేకుండ తనను ఉద్యోగము నుండి తొలగించినందులకు, పెన్షనును నిరాకరించినందులకు నాకుమారుడు రాజావారిపై దావా వేశాడు. ఆ దావా ఇప్పుడు విచారణలో నున్నది.)

అప్పటి వరకు నేను సంగ్రహించిన కథలు, వర్ణనలు, వివరణలు గల సోర రికార్డులలో నుంచి ఇతరత్రా నేను సిద్ధపరచిన పదజాలం నుంచి ఈ నిఘంటువులో చేర్చవలసిన మాటలను చాల జాగ్రత్తగా ఏర్చికూర్చాను. అయితే నావద్దనున్న సోర భాష పదాల రికార్డు సంపూర్ణమైనదికాదు. ఒకవ్యక్తికి, అందులోను నా పరిస్థితిలో నున్న పేదవానికి సోర భాషలోని అన్ని పదాలకు చెందిన వివరాలను సంగ్రహించడం సాధ్యంకాదు. ప్రతి భాషలోను ఎప్పుడోగాని వాడుకలోనికి రాని పదాలు కొన్ని ఉంటాయి. ఒక భాషలోని "కృతజ్ఞతలు" (thanks) అనే మాటను వినుటకు తనకు ఎంతో కాలం పట్టిందనీ ఆభాషలో అటువంటి మాటలేదనే అభిప్రాయమునకు వచ్చిన తరువాతనే కొన్ని పరిస్థితుల వత్తిడి మూలంగానే ఆమాటను వినడం జరిగినదని ఒక మిషనరీ చెప్పారు. భవిష్యత్తులో సోరభాషను అధ్యయనంచేయువారు ఈ నాకృషిని మరింత మెరుగు పరిచెదరని ఆశిస్తున్నాను.

సోరభాష అభివృద్ధికి నోచుకోని భాష. దానికి గుర్తించదగిన ప్రామాణికత లేదు. ఒక గ్రామానికి, మరొక గ్రామానికి, ఒక మనిషికి మరొక మనిషికి కూడ ఉచ్చారణలో భేదం కనిపిస్తుంది. సోరభాషను అధ్యయనం చేయువారు ఈ నిఘంటువులో లేని పాఠభేదాలను, ధ్వనులలోని భేదాలను సోర మాన్యుయల్‌లో (9. పేజి) చూడవచ్చును. ఈ పాఠభేదములను నిర్ణయించుటలో నేను ఎన్‌సైక్లోపీడియా ముండారికాలో రెవరెండ్ హాఫ్‌మన్‌గారు అవలంబించిన పద్ధతినే అనుసరించాను. స్థలాభావమువలన తరచుగా వాడుకలో లేని అట్టి పదాలను ఇందులో చూపలేదు. అన్ని సజీవ భాషలలోను పాఠ భేదాలుంటాయి. ఎంతో అభివృద్ధి చెందిన ఆంగ్ల భాషలో కూడ ఈ పాఠభేదాలున్నాయి. సంప్రదాయకంగా వాడుతున్న అక్షరక్రమం (spelling) దీనిని బయటకు తెలియనీయదు. వాటిని ధ్వనిననుసరించి నిర్మించిన నిఘంటువుల లోనే చూడగలం.[1] సంస్కృత భాషకు కూడ అటువంటి ప్రత్యేక నిఘంటువులున్నాయి.

---

1. ఇంగ్లీషు భాష ఉచ్చారణలోని అసంగతాల గురించి (Maitre Phonetique) మైత్రి ఫోనిటెక్ మే-జూన్ 1909 పేజీ 86 చూడండి. వ్యక్తిగతమైన ఉచ్చారణ సాధారణముగా అసంగతంగానే ఉంటుంది. వడి, స్థాయి, తీవ్రత, ఆక్షణాన ఉన్న ఉద్రేకతపై ఉచ్చారణ ఆధారపడి ఉంటుంది. ఇది విదేశీయుల అవగాహనకు అడ్డు పడుతుంది.

మోడరన్ ఇంగ్లీషు యూసేజ్ నిఘంటువులో contumely అనే పదానికి 5 ఉచ్చారణ భేధాలున్నాయి. ఆక్సుఫర్డు ఇంగ్లీషు నిఘంటువులోని ఉచ్చారణ మిగిలిన అన్ని ఉచ్చారణల కంటె నిలిచి ఉండుటకు అవకాశము తక్కువ.

నేను అనేక పర్యాయపదాలను, జాతీయాలను కూడ సేకరించాను. కాని స్థలాభావం వలన వాటిలోని కొన్నింటినే ఇందులో చేర్చాను. కఠిన పదాలను ఏవిధంగా ఉపయోగించాలో ఉదాహరణ పూర్వకముగా చెప్పడానికి ప్రయత్నించాను. కొన్ని సందర్భాలలో ఉదాహరణలకు ఆంగ్ల అనువాదాలను ఇవ్వలేదు. ఆ కొత్త పదాల అర్థాలను నిఘంటువులో చూచి ఎవరైనా తెలుసుకో గలుగుతారు. ఇంగ్లీషు - సోర నిఘంటువును వాడుకునే పద్ధతే ఈ నిఘంటువుకూ వర్తిస్తుంది. సోర మాన్యుయల్ చదివినవారికి సమాసాలు (compounds), నిష్పన్నరూపాలు (derivatives) ఏ విధంగా ఏర్పడతాయో పూర్వ, మధ్య అంత్య ప్రత్యయాలు ఏ విధంగా ఏర్పాటు చేసుకోవాలో తెలుస్తుంది. అందుచేత ఈ నిఘంటువులో వివరించని సమాసాలు, నిష్పన్నరూపాలు నిఘంటువులోని మూలపదాలను చదివి తెలుసుకోగలరు.

ఎర్నాకుళం (కొచ్చిన్ రాష్ట్రం) మహారాజా కళాశాలలోని ఆచార్యులైన నా మిత్రులు శ్రీ ఎల్. వి. రామస్వామి అయ్యరు గారి సలహా మేరకు సోర భాషకు ఆ భాషా కుటుంబానికి చెందిన ఇతర భాషలకు గల పోలికలను వివరించుటకు ప్రయత్నించాను. నావద్ద సోర కుటుంబానికి చెందిన ఇతర భాషల పదాలు చాల తక్కువ సంఖ్యలోనే ఉన్నాయి. నా కుమారుడు జయపురంలో సేకరించిన గుటోబ్, పరెంగ్, రెమో భాషలలోని కొన్ని పదాలు, లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా గ్రంథంలోనివి, మణింద భూషణ భాదురి సంకలనం చేసిన ముండా- ఇంగ్లీషు నిఘంటువులోనివి. రాయ్ బహదూర్ శరశ్చంద్ర రాయ్, ఎం.ఎ.; ఎమ్. ఎల్.సి. ప్రచురించిన బిర్‌హోర్‌ల చరిత్రలోని బిర్‌హోర్ పదాలు, మార్టిన్‌గారి ఇంగ్లీషు-సంతాలి నిఘంటువు, అసంపూర్తిగా మిగిలిపోయిన హాఫ్‌మన్ గారి ఎన్‌సైక్లోపీడియా ముండారికా మరియు బోడింగు గారి సంతాలి-ఇంగ్లీషు నిఘంటువుల (అసంపూర్ణం) నుండి సంగ్రహించిన కొద్ది పదాలతోనే సరిపోల్చాను.

ఇందుకు సంబంధించి నేను పరిశీలించదలచిన అన్ని గ్రంధాలను సంపాదించ లేక పోయినందువలన నేను చేయదలచిన దంతా చేయలేక పోయాను. నాయీ స్వల్పమైన తులనాత్మక అధ్యయనం వలన కలిగిన ఫలితాలను ఆయా పదాల తరువాత రెండు రెక్టాంగ్యులర్ బ్రాకెట్ల మధ్యక్లుప్తంగా వివరించాను. సోర, గుటోబ్, పరెంగ్, రెమొ భాషలను మాట్లాడువారు అధికంగా ఉన్న విశాఖపట్నం గంజాం జిల్లాలలోని విద్యావంతులు ఈ భాషలను అధ్యయనం చేయదలచిన ఉపయోగ పడునని నాఅభిప్రాయం. ఎన్ సైక్లోపీడియా ముండారికా లో కొన్ని ఐరోపా భాషలకు ముండారీ భాషకు గల పోలికలను నేను

గమనించాను.[1] అదేవిధంగా కొన్ని లాటిన్ భాషా పదాలకు సోర భాషా పదాలకు గల సామ్యమును చూపుటకు ధైర్యము చేశాను. ముండారీ భాషలో లభించని కొన్ని లాటిన్ భాషా పదాలలోని పోలికలను సోర భాషలో చూడవచ్చును. ఉదా: కెన్ = పాడు .

సోరభాషకు, ఆస్ట్రిక్ కుటుంబానికి చెందిన ఇతర భాషలకు గల సంబంధాలను తెలియజేసే భాషాసామగ్రి చాల ఉంది. ఈ మూలసామగ్రి నామవాచకాలు, క్రియలే కాకుండా విశేషణాలు, పూర్వప్రత్యయాలు, మధ్యప్రత్యయాలు, అంత్యప్రత్యయాలు ఏ విధంగా ఏర్పడింది తెలియజేస్తాయి. సమర్థులైన పండితులు ఈ భాషల పరిశోధనలను చేపట్టక ముందే ఇవన్నీ అంతరించిపోవునేమో అనే భయం నాకున్నది. ఎంత ఖర్చు కయినా వెనుదీయక, భాషాభివృద్ధికి దోహదపడే ఎన్ సైక్లోపీడియా, ముండారికా వంటి బృహద్గ్రంథాలను ప్రభుత్వమే ప్రచురించాలని రెవరెండ్. హాఫ్ మన్ గారు అభిప్రాయపడుతున్నారు. వారు ఈ విధంగా అన్నారు.

"ముండారీభాష చాల త్వరితంగా అంతరిస్తున్న భాష. దానిని పూర్తిగా పదిలపరచుటకు అయ్యే ఖర్చు, శ్రమ ఎంతయినా అది మనం చెల్లించవలసిన మూల్యం కంటె ఎక్కువ కాదు. జర్మనీ, కెల్టిక్, స్లోవోనిక్ మాండలికాలలో ఏ ఒక్క మాండలికం పూర్తిగా నశించిపోయినా ఇండో-జర్మానిక్ భాషల తులనాత్మక అధ్యయనానికి కలిగే నష్టము అంత ఎక్కువ కాదు. ఎందుకనగా తులనాత్మక అధ్యయనానికి సరిపడినంత మాండలికాల పరిశీలన ఈ పాటికే వాటిలో జరిగింది. అయితే ఇదే అభిప్రాయమును సెమెటిక్, ఇండో-జర్మానిక్ భాషా కుటుంబాలకు ఆవలనున్న ఎంతో విస్తారమైన భాషా కుటుంబాల గురించి చెప్పలేం. ఈ భాషా కుటుంబాల గురించి దాదాపుగా

---

1. S = సోర, M = ముండారి, Gr = గ్రీకు, Ger = జర్మనీ, Eng = ఇంగ్లీష్ Fl = ఫ్లెమిష్, Skt = సంస్కృతం. నేను చేర్చిన సోర పదాలు ఆ పదాల శ్రేణిలో మొదట చూపబడినవి. Orol (S), horo (M), horo (Ger) = to watch; galoi, jaloi (S) = to glide, gilad (M) = slippery ; ausgleiten (Ger), glide (Eng); lad (S) = to go to the bottom by being pressed ladi (M), laden (Ger. Fl.&Eng); lud (S). lutur (M),ohr (Ger), oor (Fl.), ear (Eng) nam (S), na (M), num (Gr), nu (Fl), nu (Skt), now (Eng); Nam. (S) = to hold, obtain, nam (M), nehmen (Ger), nemen(Fl); aNum (S), numu, nutum (M), name Ger)

neemen (Fl), name (Eng);

or (S) = to forrow, or (M) = to drag along, or (Gr) = quick movement;

sba-kab (S) = to grip with tongs, sab (M) = to catch, ..........

మనకేమీ తెలియదనే చెప్పాలి. అందుచేతనే తులనాత్మక భాషాశాస్త్ర అధ్యయనం పెరుగుతున్న కొలదీ ప్రతి దశాబ్దానికి ఈ భాషా కుటుంబాలను కొత్త కొత్త పేర్లతో పిలువ వలసి వస్తున్నది.[1] ఈ భాషలలో అనేకం ఇప్పటికీ పూర్తిగా పరిశోధనకు నోచుకోలేదు. వాటిగురించి కొంత మాత్రమే తెలుసుకోగలిగాం.[2] దురదృష్టమేమంటే వీటిలోని చాల భాషలు అవసరమైనంత సమాచారము లభ్యము కాకముందే అంతరించిపోయాయి.[3] ఈ భాషల అంతర్ధానం వలన విజ్ఞాన శాస్త్రానికి కలిగే నష్టమేపాటిదో మన ఊహకందనిది. ఈ కారణంగా చాల వరకు ఆ భాషలలో ఒకదానికి మరొకదానికి గల సంబంధాన్ని చాల తేలికగా చూపగలిగే శక్తి ఈనాడు మనకు లేకుండా పోయింది. వాటిని పరోక్షంగాను అరకొర సూచికల వలన మాత్రమే కొంత వరకు ఊహించగలము. ఒక ఉదాహరణ ఏమనగా పాల్, ఫ్రెడరిక్ సరసిన్ సోదరులు, సి.జి. సెలిజ్‌మన్‌తో కలసి సింహళ దేశానికి చెందిన వెడ్డజాతివారు వాడే పదాల పట్టికను తయారుచేశారు. అవి సింహళ భాషలోని పదాలతో పోలిలేవు. అవి వెడ్డజాతివారి స్వీయ భాషాపదాలు. ఇప్పుడా భాషపూర్తిగా 'వినుమరుగైపోయింది'. అయితే ఆ పదాలకు ముండారీ భాషలోని పదాలకు దగ్గరి పోలికలున్నాయి.[4] వెడ్డ: (1) హుర్ = మనిషి; (2) కుల్ = చిరుత; (3) తబల = గొడ్డలి; (4) డియె = నీరు; (5) డియగమ = పారుతున్ననీరు

ముండారి: (1) హెరొ, హోర్, హుర్ లేదా ఉర్ = మనిషి; (2) కుల = పులి, చిరుత; (3) తబల, తబ్ల = వేటగొడ్డలి; (4) డ = నీరు; (5) డ గమ = నీరు పడుతున్న; వర్షం.

( సోర:- (1) సోర, సోర్ (2) కిన, కిడ్; (3) డ'అ (4) గుమ్ )

---

1. కొలారియన్, ముండా, సంతాలి, నిషాద మొ॥)

2. ఉ॥ గుటోబ్, రెమో, పరేంగ్.

3. సర్. డబ్ల్యు. డబ్ల్యు. హంటరు గారి ఆర్యేతర భాషల తునాత్మక నిఘంటువులో చోటు చేసుకున్న కురి భాషా పదజాలం ఏమైనదీ మనకు తెలియదు. ఆవిధంగానే పూర్వపు జనాభా లెక్కల రికార్డులలో చోటుచేసుకున్న కొన్నిభాషలు లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా గ్రంథాలలోప్రస్తావనకు రాలేదు,

4. వెడ్డల భాషకు ముండారి భాషకు సంబంధము ఉన్నట్లే సోర భాషకు సంబంధము కలదని తెలియజేయుటకు నేను సోర పదాలను కూడ చేర్చాను.

సింహళదేశ గుహావాసులు ఇప్పటికీ జంతువులను వెంటాడి మాంసాహారాన్ని, వేళ్ళు, ఆకులు, గింజలు స్వతహగా పెరిగే మొక్కలుండి శాకాహారాన్ని సేకరిస్తుంటారు. మనకు వారి భాషా సమాచారము తగినంత లభించినయెడల ముండారీలు ఇప్పటికీ వెడ్డలతో అవిచ్ఛిన్న సంబంధాలు కలిగి ఉన్నారని, వారు ముండారీలకంటె అభివృద్ధి చెందిన శాఖకు చెందినవారు లేదా ముండారీలు భారతదేశానికి వచ్చునాటికే భారతదేశంలోని కొన్ని ప్రాంతాలలో స్థిరపడినవారుకావచ్చని ఊహించడమేకాదు వారు పరస్పరం ఎలా ప్రభావితం చేసుకొన్నదీ నిర్ణయించుకోగలం. కావున మన భూగోళములో ఎంతో విశాల ప్రాంతానికి విస్తరించి పరస్పర సంబంధం కలిగిన సంకీర్ణ భాషలలో ఇంకా అంతరించిపోకుండా ఉన్న భాషలమధ్య జరిగే తులనాత్మక భాషాధ్యయనము ఫలించాలంటే ముండారీ భాషలోని ఏ ఒక్క అక్షరాన్ని మనం కోల్పోరాదు. ఆ భాషకు గల కొన్ని లక్షణాలు ఇంకా జీవించి ఉన్న ఇతర భాషలలో అంత స్పష్టంగా కనిపించవు. ముండారీ భాషానిర్మాణ లక్షణాలు, ప్రాచీన వైభవాన్నిసూచించడమే కాదు, ఇంకా పరిశోధించని మాండలికాలతో, శాఖలతో ఈభాషకు గల స్పష్టమైన పోలికలను ధృవీకరిస్తాయి. ఇదంతా తులనాత్మక భాషాశాస్త్ర అధ్యయనంముందున్న విశాల క్షేత్రములోని అనేక చీకటి కోణాలపై వెలుగును ప్రసరింపజేయుటకు చక్కగా అమరుతుంది.''

సోరభాషకూడ ముండారి భాష అంత ప్రాముఖ్యం కలదే. సోరభాషనుమాట్లాడే జాతిని, హిందువులు సవర, లేదా శబరి అని వ్యవహరిస్తారు. వేదసాహిత్యంలో కూడ ఆంధ్రులతో పాటు ఈజాతి ప్రస్తావన ఉంది. తరువాత వచ్చిన సంస్కృత సాహిత్యములోను, బౌద్ధ, జైన పవిత్ర మతగ్రంథాలలోను ఈ జాతిని ప్రస్తావించడం జరిగింది. దేశభాషాసాహిత్యాలలోకూడ సవరల వర్ణన ఉన్నది.[1] ప్లిని (క్రీ.శ.77) వీరిని సౌరి అని సంబోధించాడు. ఇప్పుడు మనం వాడుతున్న సోరకు అది అనుగుణమైనది. టోలమి

---

1. తెలుగు: మహాభారతము-ఆదిపర్వతము 7. 106; కర్ణపర్వము 1 - 211; హరివంశము-పూర్వభాగము 7. 5; భోజరాజీయము 1. 116; 4. 186; పండితారాధ్యచరిత్ర-పర్వతప్రకరము. పేజీ 813; బసవ పురాణం(ద్విపద నూతన ముద్రణ),పేజీ 102; హరివంశము 7. 57; కాశీఖండము 4. 62; నృసింహపురాణము 5. 154; భాగవతము 4. 506; వరాహ పురాణం 7. 102, 107; మనుచరిత్రము 4, 78; కాళహస్తి మహాత్మ్యం 1. 65, 66; చంద్రభాను చరిత్రము 2. 35, 37; 5. 50; బసవపురాణం(పద్య కావ్యం) 4. 37; ప్రబంధరత్నావళి, పేజీ 137( కువలయాశ్వ చరిత్ర నుండి). కన్నడ: కిట్టెల్ డిక్షనరీ - శబర- చూడండి.

(క్రీ.శ.130) వీరిని సబరె అన్నాడు. అది సంస్కృతీకరింపబడి శబరజాతిగా ఆర్యసాహిత్యంలో వర్ణింపబడింది. ఆర్యులు ఈ శబరులను జయించి వారిని దూరప్రాంతాలకు తరిమిన తరువాత ఎంతో కాలానికి వచ్చిన సాహిత్యమది.ఆర్యులు తమ ప్రాబల్యాన్ని పశ్చమమునుండి తూర్పునకు విస్తరించినపుడు ఈ శబరులు, వారి సంతతులవారు ఇతరులకు చొరశక్యముకాని పర్వతాలకు, అడవులకు పారిపోయి తలదాచుకొన్నారు. ఆర్య సాహిత్యంలో ఈ దురదృష్టవంతులను రాక్షసులుగా నిందార్హమైన, కళంకపూరితమైన విశేషణాలతో చిత్రించారు.[1] నిషాద అనేది వీరిని వర్ణించిన ఒక పదం; ఎంతో విస్తృతి కలది. వీరు ప్రాచీన నిషద దేశవాసులయినందున వీరిని నిషాదులన్నారు. ఆర్యసాహిత్యంలో వర్ణించిన వీరి జనావాసాలు టోలమీ వర్ణించిన జాతుల నివాస ప్రదేశాలతో దాదాపుగా సరిపోతాయి. ఆ దేశం రాను రాను కుదించుకుపోయి ఇప్పుడు వారుంటున్న ప్రాంతానికి పరిమిత మైపోయింది. ఆర్యుల తరువాత మన దేశాన్ని పాలించిన ముసల్మానులు కూడ వీరి పట్ల ఉదారంగా వ్యవహరించలేదు. సాహిత్యమే కాదు. శాసనాలు కూడ దీనిని ధ్రువపరుస్తున్నాయి.[2]

ఆర్యులు మన దేశానికి వలసరాక పూర్వం భారత దేశం లోని అతి ముఖ్యమైన జాతివారు శబరులు. వారిలో రాజ్య పాలకులున్నారు. వారికి సాంఘిక, రాజకీయ, మత వ్యవస్థలున్నాయి. వారు తమనాగరికతను అభివృద్ధి పరచుకొన్నారు. ఆర్యులకు ద్రావిడులకు ముందున్న భారతదేశంలోని పరిస్థితులను అధ్యయనం చేయుటలో సిల్వెయిన్, లెవి, జీన్ ప్రయ్‌లుస్కీ, యూల్స్ బ్లాక్ మొదలైన ఐరోపా ఆచార్యులు,

---

1. లంబ-లంజియ (పొడవుతోకలు) అనే మాటను ఓఢ్రులు, అధికారులు వారి ఆఫీసు రికార్డులలో- చాలా అనాగరికంగాను, ఎవరూ చొరలేని ఏజెన్సీ మారుమూల ప్రాంతాలలోను నివసిస్తున్న సోరలను అంటారు.)

2. నాట్య శాస్త్రకర్త అయిన భరతుని కాలానికి (క్రీ.శ. సర్కారు 600) ఒరిస్సాలోని శబరులు బొగ్గు తయారు చేయువారిగా దిగజారిపోయారు. వీరు సహారులని పిలువబడి ఇప్పటికీ అదేస్థితిలో ఉన్నారు. శబరాదిత్యుడు కళింగదేశపు కామార్ణవునిచే క్రీ.శ. సర్కారు 720లో చంపబడ్డాడు. ఉదయ చంద్రుడనేవాడు శబరముఖ్యుడైన ఉదయనుని నెవ్వెలి అనుచోట ఓడించాడు. ఉత్తరాన ఉన్న, నిషాద ముఖ్యుని 736(క్రీ.శ)లో వెంట తరిమాడు. పశ్చిమ గంగ రాజయిన మానసింహుడు శబర ముఖ్యుని క్రీ.శ.950లో హతమార్చాడు. క్రీ.శ. 1300లో జయపురం కోట గవర్నరు ముష్కరతెగలకు చెందిన భిల్లులను శబరులను, పుళిందులను అదుపులోనికి తెచ్చాడు. క్రీ.శ. 1484 లో చర్మన్వతి నదిపై ఉన్న ఖిదావాడ వద్ద ఘియాస్ షా ఖిల్జీ అనే సైనికాధికారి సవరల తిరుగుబాటును అణచివేశాడు.

భారతదేశ ఆచార్యులు పూర్వఆర్య, పూర్వద్రావిడుల గురించి ఇప్పుడు అధ్యయనం చేస్తున్నారు.[1]

కోలు జాతియొక్క విభిన్న ఉపజాతులున్నిటికీ సవర అనే పేరు వర్తిస్తుందని ఈ విషయాన్ని పరిశోధిస్తున్న పండితులందరూ ఒకే నిర్ణయానికి వచ్చారు. కోలారియనులందరూ శబరజాతికి చెందిన వారేనని బి.సి. మజుందారుగారు స్పష్టంచేశారు (ద అబోరిజిన్స్ ఆఫ్ ది హైలేండ్ ఆఫ్ సెంట్రల్ ఇండియా, పేజి.13. రాయ్ బహదూర్ ఎస్. ఆర్. రాయ్ గారు కూడ ఇదే అభిప్రాయాన్ని కలిగియున్నారు- వారి ఎకౌంట్స్ ఆఫ్ ముండాస్- చూడండి) అయితే రెవరెండ్ హాఫ్ మన్ గారు ఒక ప్రతిపాదన చేశారు. ముండా, కొలారియను మొ॥ వేరు వేరు పేరులకు బదులు అందరికీ వర్తించే విధంగా సంతాలి అని ఒకే పేరుతో వీరిని పిలుచుట సబబు అని అన్నారు. సంతాలులే సంఖ్యాపరంగా ఇతర జాతులకన్న మిన్న. ఇప్పటికీ సంతాలిజాతి ఉన్నది. ఉత్తరాదిన గల ఆదివాసులను ప్రాచీన సంస్కృత సాహిత్యములో ఈ సంతాలిపేరునే సవర అనే రూపంలో విస్తృతంగా వాడారు అని హాఫ్‌మన్ గారన్నారు.[2] (ఎన్‌సైక్లోపిడియా ముండారికా - 1815 పేజి చూడండి). అయితే సంతాలి అనే పదం సవర అనే పదం నుండి వచ్చినదికాదు. సవర అనే మాటకు అది ఏవిధంగాను

---

1. ప్రఖ్యాత ఫ్రెంచి పండితుడు అయిన సిల్వియన్ లెవీ తన నిశిత మేధా శక్తికి, జ్ఞానమునకు ఇటీవలనే విశ్వభారతిలో ప్రశంసింపబడ్డాడు. అతడు అనేక నిజాలను ఒక చోట చేర్చి, అంతకు ముందే ఒక స్థిరమైన అభిప్రాయము వైపు వేలు చూపుచున్న దిశను నిశ్చయించి, ఆర్యులు మన దేశమును ఆక్రమించక పూర్వము, బహుశః ద్రావిడులు కూడ రాకపూర్వము చాలా భూభాగానికి విస్తరించిన మన ప్రాచీన నాగరికతను ఆస్ట్రిక్ తెగలు సృష్టించారనీ, ఆ నాగరికతకు భారత దేశము ఒక పట్టుకొమ్మ అని చెప్పాడు.

ఇప్పుడు ఆ నాగరికత లేదు. ఆర్యులు దానిని కాలానుగుణంగా మార్చి తమ నాగరికతలో కలుపుకున్నారు. అయితే ఒక విషయాన్ని మనం ఊహించవచ్చును. కొలారియన్‌ల పూర్వీకులను ఆర్యులు యుద్ధంచేసి లొంగదీసుకున్నప్పుడు వారు అనాగరికులు కారు. కొంత వరకు ఇతరులకంటె అభివృద్ధి చెందినవారే. అదే నిజమయితే వారు మన భారత దేశనాగరికతను, మన దేశ మత చరిత్రను తీర్చి దిద్దుటలో ముఖ్యపాత్ర వహించారనే చెప్పాలి. ఈ కొలారియన్‌ల పుట్టుకను, వారి ప్రత్యేక లక్షణాలను వివరంగా చెప్పవీలు పడదు. కాని వారి ఆలోచనలను, భావాలను శతాబ్దాల తరబడి పాటించ బడుచున్న మన దైనిక ఆరాధనలో చూడగలము(విశ్వభారతి 2వ వాల్యుం జనవరి 1925- పేజీ 345, పేజీ 15 చూడండి)

2.వాలు అక్షరాలు నేను చేర్చినవి.

సంబంధంలేనిది. కావున హాఫ్ మన్ గారి అభిప్రాయం ఆర్యులు మన దేశానికి రాకపూర్వం భారత దేశంలోని అతి ముఖ్యజాతి శబరజాతి అనే నా వాదనను పరోక్షంగా సమర్థిస్తుంది.

కన్నింగ్ హామ్ గారి పురావస్తు పరిశీలన గ్రంథంలో చెప్పిన ప్రాచీన కాలానికి చెందిన శబరుల రాజకీయ ప్రాభవాన్ని విస్తరణను తెలిపే అనేక చిహ్నాలు దేశమంతా లభిస్తున్నాయి. మన దేశంలోని అనేక ప్రాంతాలలో (ముఖ్యంగా మద్రాసురాష్ట్రం లోని విశాఖపట్నం, గంజాం జిల్లాలతో పాటు ఒరిస్సా, బీహారు, బెంగాలు, అలహాబాదు, గ్వాలియర్, రాజపుతానా, మధ్యభారతంలోని, మధ్యరాష్ట్రాలలోని ఇతర ప్రాంతాలలోను) స్థానికంగా తెలిసిన, కొన్ని సందర్భాలలో అధికారికంగా గుర్తింపబడిన, సవర లేదా దాని నుండి వచ్చిన సువర్, సుహార్, సవర్, సోవర్స్ పేర్లతో ఇప్పటికీ అనేక ఆదిమతెగలున్నాయి (ఈ తెగలవివరాలను బెంగాల్, యునైటెడ్ ప్రోవిన్సెస్, సెంట్రల్ ప్రోవిన్సెస్ మరియు మద్రాసు ప్రెసిడెన్సీల- కేస్ట్స్ అండ్ ట్రైబ్స్ అను నివేదికలలోను, గెజిటీర్లలోను, జనాభా లెక్కల నివేదికలలోను చూడండి ).

లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా అనే గ్రంథంలో హిమాలయ పర్వత శ్రేణులలో నివసించువారు మాట్లాడే మాండలిక భాషలో ముండా (శబరి) భాషయొక్క ప్రభావ చిహ్నాలు ఇప్పటికీ గోచరిస్తున్నాయి. ఆ గ్రంథం నాల్గవ సంపుటి లోని పటంలో చూపించిన వాటికంటె విస్తరించిన ప్రాంతాలలో దక్షిణాదిన సోర, గుటోబ్, పరెంగ్, రెమొ జాతులవారు నివసిస్తున్నారు (1931 జనాభాలెక్కల నివేదికలను చూడండి.)

శ్రీలంకలో శబరగాం ఉండటం, అక్కడి వెడ్డలు ఒకప్పుడు శబరభాషను పోలిన భాషను మాట్లాడటం, ఇంతకుముందు చెప్పిన నా అభిప్రాయాన్ని బలపరుస్తున్నాయి. (సెలిజిమన్ అకౌంటు ఆఫ్ వెడ్డాస్ చూడండి).

కావున, ఆస్ట్రిక్ కుటుంబములోని భారతీయ శాఖకుచెందిన భాషల సముదాయానికి వేరువేరు రచయితలు పెట్టిన కొలారియన్, ముండా, సంతాలి, విషాద మొ॥ అనిశ్చిత నామములకు బదులు వేదకాలమునాడు భారత దేశములో వాడుకలోనున్న శబర అనే మాటను పునరుద్ధరించడం సమంజసము కాదా?

మద్రాసు రాష్ట్రములోని గంజాం, విశాఖపట్నం జిల్లాలలో పేరు పొందిన ఆదివాసి జాతిపేరు, వారి బాషపేరు కూడ సోర. ఇది శబరి అనే పదముతో నేరుగా సంబంధము కలిగి ఉంది. ఇప్పుడు అక్కడ నివసిస్తున్న వారుప్రాచీన శబరజాతికి, వారి భాషకు ఆధునిక

ప్రతినిధులు. సోర, సంతాలి, ముండారి, ఇంకా మిగిలిన భాషలన్నీ, ఆదిమభాష అయిన శబరినుండి పుట్టినవే అని నేను నమ్ముతున్నాను. తగిన సామగ్రి లభిస్తే దీనిని రుజువు చేయవచ్చును.[1]

ఈ సోర భాషలో లభ్యమౌతున్న విలువైన సామాగ్రిని దృష్టిలో నుంచుకొని ఆస్ట్రిక్‌భాషా కుటుంబాల తులనాత్మక భాషా శాస్త్ర అధ్యయనము చేయువారికి, విద్యార్థులకు ఉపయోగపడు విధముగా ఒక సోర వాచకమును తయారు చేయవలసిందని మూడు సంవత్సరాల క్రితం ఆచార్య యూల్స్ బ్లాక్ గారు నన్ను కోరారు. "సోర వాచకము తయారు చేయమని మిమ్ము ప్రభుత్వము కోరలేదా? ఆ పాఠ్యగ్రంథం ఎలా ఉండాలంటే అందులోని పాఠాలయొక్క అనువాదాలు వాటిప్రక్కనుగాని, వాటి క్రిందను గాని ఉండాలి. వాటిలో మానవజాతి శాస్త్రంపై ఆసక్తి కలిగించే కొత్త పాఠాలను కూడ చేర్చాలి. సోర భాషగురించి, వారి నివాసం గురించి తెలిసిన మీవంటి విజ్ఞులు తరచుగా లభించరు. భవిష్యత్తులో మీవంటి వారు ఒక్కరుంటే చాలు, సోరల జీవితమే పూర్తిగా మారిపోతుంది. మీరు లేకపోతే ఆభాషే అంతరించి పోయేది.[2] మీరు ఈ ఉత్తరాన్ని మీ ప్రభుత్వానికి పంపగలరు." అని వారన్నారు.

ఈ ఆచార్యులవారి లేఖను నా ఉత్తరానికి జతచేసి మద్రాసుప్రభుత్వానికి పంపాను. వారు దానిని జిల్లా అధికారులకు పంపారు. జిల్లా అధికారులు విద్యాశాఖాధికారులను

---

1. నాసవర భాష మాన్యుయల్ ప్రచురణకు పూర్వము సోర (సవర)భాషను సంకర భాష అని కొందరు భావించారు. ఈ మాట హిందూ మతములోనికి మారిన సవరలు అని పిలువబడే వారికి వర్తిస్తుంది. కొండ దిగువున, పల్లపు ప్రాంతాలలో తెలుగు వారితో కలిసి పర్లాకిమిడి, టెక్కలి తాలూకాలలో నివసిస్తున్న వారికి వర్తిస్తుంది. (1931 జనాభా లెక్కల నివేదికలను చూడుడు.) అప్పుడు సుమారు 80 సంవత్సరాల క్రితం హార్గ్‌సన్ తయారు చేసిన అతి కొద్దిపాటి, తప్పులతో కూడిన సవరపదాల పట్టిక పైనే భాషా శాస్త్ర విద్యార్థులు ఆధార పడవలసి వస్తుంది. ఆ పట్టికలోని మాటలు చదువు రాని ఒక సెరంగు సేవకుడు సవరలకు దుబాసీగా ప్రభుత్వ కార్యాలయాలలో వ్యవహరిస్తూ చెప్పినవి. మనం ఒకటి గుర్తుంచుకోవాలి. తూర్పు కనుముల కొండ దిగువ ప్రాంతాలలో నివసించిన సోర జాతివారు, కొండపైన నివసించిన వారు మాట్లాడు భాష ముండారి, సంతాలి సంకర భాష కంటె శుద్ధమైనది మరియు పర్వత లోతట్టు ప్రాంతాలలో నివసించే సవరలకు ఆ భాష తప్ప వేరే భాష రాదు. ఇది అతి శుద్ధమైనదని అందరూ అంగీకరించారు. దానినే నిఘంటువులో ప్రామాణిక భాషగా పరిగణనకు తీసుకున్నాను.

2. వెడ్డల ప్రాచీన భాషగురించి, ముండారీ భాషగురించి రెవ. హాఫ్‌మన్ రాసిన దానిని చూడండి.

సంప్రదించారు. నాకు తెలిసినదేమంటే, ఆ విద్యాశాఖాధికారులు అచ్చట పాఠశాలలకు అట్టి సౌరవాచకము అవసరం లేదన్నారు. ఫలితంగా ప్రభుత్వం అటువంటి సౌర వాచకమును ప్రచురించుటకు సిద్ధపడలేదు. ఈ సౌర ప్రాంతం మద్రాసు ప్రభుత్వ పరిధినుండి ఒరిస్సా రాష్ట్ర పరిధి లోనికి మార్చబడింది. ఈ మార్పు 1936 ఏప్రెల్ ఒకటవ తేదీ నాడు లాంఛనంగా జరుగుతుంది. మరి ఒరిస్సా ప్రభుత్వము భాషాశాస్త్ర ప్రయోజనమును దృష్టిలో నుంచుకొని ఈ నాప్రతిపాదనను అమలు చేస్తుందో లేదో వేచి చూడాలి. నశించుటకు సిద్ధముగా నున్న ఆస్ట్రిక్ కుటుంబానికి చెందిన భారతీయ శాఖలోని భాషలను శాస్త్రీయ దృక్పథంతో అధ్యయనం చేయడానికి అనేక సంపుటాలలోనున్న హాఫ్మన్ గారి ఎన్సైక్లోపేడియా ముండారికాను ప్రచురించమని బీహారు, ఒరిస్సాల లెఫ్టెనెంట్ గవర్నరయిన సర్. ఇ.ఎ. గైట్‌గారు తమ ప్రభుత్వంపై ఒత్తిడితెచ్చి ప్రచురింపచేశారు.

ప్రొ॥ యూల్స్ బ్లాక్ గారు ప్రతిపాదించిన సౌర వాచకము వంటి దేశభాషా వాచకముల అవసరమును తెలియజేయుటకు ఎన్సైక్లోపేడియా బ్రిటానికాలో భాషాశాస్త్రము గురించి రాసిన వ్యాసములోని కొన్నివాక్యాలను ఇచ్చట ఉదాహరిస్తున్నాను. "సామాజిక శాస్త్రజ్ఞులు, మానవజాతి శాస్త్రజ్ఞులు భాషా శాస్త్రముపై ఇప్పుడు శ్రద్ధ చూపుచున్నారు. మానవులయొక్క సామాజిక ప్రవర్తనకు, భాషకు గల సంబంధమును అధ్యయనం చేయడం ఎంతో

అవసరమనివారు గ్రహించారు. ముఖ్యంగా బి. మలినౌస్కీ ఆదిమజాతులు తమ భాషలను ఏవిధంగా వ్యక్తీకరించినదీ చక్కగా ఊహించిన తీరున ప్రస్తావించాలి. సామాజిక వర్గాల సూచికలకు, వారి నివాసప్రాంతాల హద్దుల నిర్ణయానికి భాష ఎంత ఉపయోగమో సామాజిక శాస్త్రజ్ఞులు రాను రాను గ్రహిస్తున్నారు. సాంఘికమైన అలవాట్లను ఏకంచేయుటకు లేదా వేరుచేయుటకు భాషాభ్యాసాలకు మించినవేవీ లేవు. భాషాధ్యయనం భాష గురించి తెలియడమే గాక నాగరికతకు సంబంధించిన అనేక అధ్యయనాలకు సాధికారంగా ఉపయోగపడుతుంది. మానవజాతిశాస్త్రము మరియు జానపదశాస్త్రము యొక్క అధ్యయనానికి కావలసిన ఉత్తమసామగ్రి దేశీయ పాఠ్యగ్రంథావలననే లభిస్తుంది. అవి ఆ దేశీయుల అభిప్రాయాలను తప్పుదారి పట్టించవు. అందువలననే పాఠ్యపుస్తక పద్ధతిద్వారా ఆ విలక్షణమైన భాషలయొక్క ప్రాథమిక అధ్యయనానికి వీలు కలుగుటయే కాక ఆ విలక్షణ ప్రజల సంస్కృతులను-అవి చదువుకున్నవారైనా, చదువు రానివారైనా- అధ్యయనము చేయుటకు అనేక సాధక బాధకాలున్నప్పటికీ, రాను రాను ఆదరణ పెరుగు చున్నది. ఈ పాఠ్య గ్రంథాల పద్ధతి వలన ఆ విలక్షణ మైన భాషయొక్క

అధ్యయనం వీలవుతుంది.[1] మానవజాతి శాస్త్రానికి సంబంధించి మనకు లభించిన అతియోగ్యమయిన సాధికారిక సమాచారము భాషాశాస్త్ర అధ్యయనంలో ఆనుషంగికంగా లభించినదే. అమెరికాకు సంబంధించి ప్రాంబో క్వాకుయిట్ ప్రచురణలు, ఆఫ్రికాకు సంబంధించి వెస్టర్‌మేన్ యొక్క షిల్లుక్ పాఠ్య గ్రంథములను మనం ఇక్కడ ఉదాహరణలుగా పేర్కొనవచ్చును".

సోర జాతి చరిత్ర తెలుసుకొనుటకు ఉపయోగ పడుననే ఉద్దేశముతో వృక్షాల, గ్రామాల మనుష్యుల చిన్నపట్టికలను ఇందులో చేర్చాను. (నిఘంటువులో '-సిజ్' చూడండి)

నేను ఒరిస్సా రాష్ట్ర విద్యావంతులకు చేయు విన్నపమేమంటే సోరలను కలుసుకొనుటకు వారి భాషను అధ్యయనము చేయుటకు మీకు తగిన అవకాశాలున్నాయి. కావున నేను సంపాదించి ఇచ్చిన సామగ్రికి మరికొంత చేర్చండి. నేను చేసిన తప్పులేవైనా ఉన్నట్లయిన వాటిని సవరించండి. సోర భాషను దాని సంబంధిత భాషలతోపోల్చి అధ్యయనం చేస్తే ఆ భాషానిర్మాణం యొక్క కొన్ని లక్షణాలు తెలుస్తాయి. సవర మేన్యుయల్ సంకలనం చేసినపుడు సోర బహువచన ప్రత్యయం 'జి' యొక్క వ్యుత్పత్తి తెలియదు. ఇటీవల నా కుమారుడు, సీతాపతి జయపురంలో పరంగిభాషపై పరిశోధన చేస్తున్నప్పుడు సోర 'జీ' కి, పరెంగ్ 'గీ' కి, ఖాసీ 'కీ' కి గల సంబంధం విశదపడింది. ఖాసీ, సోరా భాషల తులనాత్మక పరిశీలన వలన విద్యార్థికి సోరపదాలను విశ్లేషించే సామర్థం వస్తుంది. మరియు, ఉ, క, కన్, కిమ్ వంటి ప్రారంభమూలకాలతో (initial elements) సోర భాషను అధ్యయనం చేయుటకు వీలుకలుగుతుంది. సోరా మాన్యువల్ లో చెప్పిన మాటలయొక్క కుదించిన రూపాలు ఏ విధంగా ఏర్పడినవో తేలికగా అర్థము చేసుకొనవచ్చును. ఆలాగుననే ఇండోనేషియా భాషలోని పొట్టి రూపాలనుకూడ అర్థం చేసుకోగలము. చేసుకోగలము. స్థలాభావము వలన సోర

---

1. డబ్ల్యు. ఐవనోవ్ అనునతడు'ఖొరసాని కుర్దిష్ పత్రాలు' అను వ్యాసంలో (ఇది బెంగాల్ ఏషియాటిక్ సొసైటీ జర్నలు ఎన్. ఎస్ 23 1927 నెం.1లో ప్రచురింపబడింది) కుర్దిష్ షెయిరీ టేల్స్‌ను జానపద వాఙ్మయ దృష్టితో చూస్తే అవి ఆసక్తికరమైనవి అవి చెప్పాడు. ఎందుకనగా ఇంతవరకూ వాటి గురించి ఎవరూ ఏమీ ప్రచురించలేదు. దురదృష్టవశాత్తు ఒకరు చెప్తుంటే వాటిని వ్రాసుకునే శక్తి నాకు లేదు. కాని ఈ ప్రాచీన ఖొరసాని కుర్దులు ఈ కథలను మెల్లగాను స్పష్టంగాను చెప్పలేక పోయేవారు. మరొక సారి చెప్పమంటే ఆవాక్యమే పూర్తిగా మారిపోయేది.

షార్టు హేండులోనో లేదా అటువంటి కుదింపు పద్ధతిలోనో వ్రాసుకుంటే తప్ప సోరలు చెప్పే సోర కథలను వ్రాసుకోలేము.

భాషా విద్యార్థికి ఈ పోలికలను తెలిపే చిన్న పట్టికను మాత్రం ఈ పీఠిక తరువాతఇచ్చి తృప్తి పడుతున్నాను. అది వారిలో ఉత్సాహమును కలిగిస్తుందని నా ఆశ.

నాకు ఎన్నో విధముల సహాయముచేసి, నేను సోర భాషాధ్యయనములో సాధించిన ఫలితాలు నశించి పోకుండ భద్రపరచుటకు వీలుగా వాటిని ప్రచురించినందులకు మద్రాసు ప్రభుత్వమునకు, దాని విద్యాశాఖాధికారులకు, జిల్లా శాఖాధికారులకు, నాకృతజ్ఞతలను తెలియజేసు కొంటున్నాను. సోర భాషను వ్యావహారిక అవసరాల కొరకు చదివే వారికి, ప్రపంచం మొత్తం మీద భాషాశాస్త్ర పండితులకు, ముఖ్యంగా అంతగా తెలియక పోయినా ఎక్కువ ఆసక్తి కలిగించే ఆస్ట్రిక్ భాషా కుటుంబాల యొక్క పరిశోధనలలో ఉన్న వారికి ఈ నిఘంటువు ఉపయోగపడుతుంది.

నాకుమారుడైన సీతాపతి సహకారము లేనిదే ఈ నిఘంటువు ప్రచురణ జరిగేదికాదని నేను వేరే చెప్పనక్కరలేదు.

నిర్దుష్టంగా చక్కగా ముద్రించి ఈ నిఘంటువును ఉపయోగించే వీలు కలిగించినందులకు ప్రభుత్వ ముద్రణాలయం సూపరింటెండెంట్ గారికి నా కృతజ్ఞతలు.

--------0--------

